


సంపుటము

సంచిక


# మహతి


సెప్టెంబరు —1939



:: సంపాదకుడు ::

వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య


మీ సతీసుతలకు
సహాయహాసము
ఋతుసంబం[illegible]న దోష
ములను పారదోలి ఆరోగ్య
జీవనమును ప్రసాదింపగల
ఔషధరాజము
లోధ్ర
గర్భాశయ రోగ
ములను నిర్మూలన
మొనరించిసంతా
నము నకు
దారి చూపునది
లోధ్ర
KESARI KUTEERAM
కేసరీకుటీరం
మద్రాసు

నవ్యకళాఫిలిమ్సు వారి

# హీరాబాయి ★

కవి :
విశ్వనాథ కవిరాజు

ఆర్ట్ డైరెక్టర్ :
అడివి బాపిరాజు



డైరెక్టర్ :
డాక్టర్ గోవిందరాజు వేంకట సుబ్బారావు

మ్యూజిక్ డైరెక్టర్ :
భీమవరపు నరసింహారావు

నవ్యకళాఫిలిమ్సు లిమిటెడ్, మద్రాస్

---

ఫేమస్ ఫిలిమ్సు (బెజవాడ) వారి

# పతివ్రత

★

కవి :
విశ్వనాథ సత్యనారాయణ యం. ఏ.,

డైరెక్టర్ :
పి. పుల్లయ్య బి. ఏ.,

# సూతాశ్రమ గీతాలు

శ్రీ కవిరాజు

బ్రహ్మపురము మందేరా
పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే
కటకందాకా మందేరా

బస్తరెల్లా మందేరా
జయపూరంతా మందేరా
కాదని వాదుకు వస్తే
నాగపూర్ దాకా మందేరా

గోలకొండ మందేరా
తెలింగాన మందేరా
కాదని వాదుకు వస్తే
నైజామంతా మందేరా

చెన్నపురము మందేరా
చెంగల్పట్టు మందేరా
కాదని వాదుకువస్తే
తంజావూరును మందేరా

బెంగుళూరు మందేరా
బెళ్ళారీ మందేరా
కాదని వాదుకు వస్తే
కన్నడ మర్ధం మందేరా

దేవికోట మందేరా
పుదుక్కోట మందేరా
కాదని వాదుకువస్తే
కాండేదాక మందేరా

# మహతి

సంపుటము ౨ | ప్రమాథి - నిజశ్రావణము | సంచిక ౨

## జిజ్ఞాస

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

ఖండించెనా ఘోరఖడ్గధార నితండు మగధసేనావ్యూహమండలంబు
నడిపించెనా తెల్గునాఁటిశిల్పము మోయు నౌక లీతఁడు రోమునగరమునకు
శ్రమియించెనా యితం డమరావతీకళా పరిషత్తులో శాస్త్రపాఠములకు
అర్పించెనా పద్యహారావళి నితండు కనకాభిషేకంబు గన్నకవికి
త్రాగెనా రామభక్తిమైఁ ద్యాగరాజు
క్రుమ్మరించిన గీతామృతమ్ము నితఁడు
పూర్వసంస్కారదూరుఁడై పుట్టు కతన
వేఁడుచున్నాఁడు వివరింపవే! సవిత్రి!

## భరత భాగ్యము

శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య

భరత రాజ్యమ్ము చంపాద్వీప సీమంగో (శ్రీ) మారవర్మఁడు సృష్టించినాఁడు
విజయరాజులు యవద్వీప రాజన్య పుత్రికల నెల్ల స్వయం వరించినాఁడు
హైందవాయుర్వేద మఖిల కాంభోజ ధాత్రీ రాజ్యమున విస్తరించినాఁడు
జావాముఖ ద్వీప దేవాలయముల రామాయణ కథ శిల్పమైననాఁడు
వేలు వేలేండ్లు సింహళ ద్వీపమెల్ల
భరతధాత్రీ సుతులు సార్వభౌము లగుచు
పాలనము సేయు నాఁడు నీ భాగ్యలక్ష్మి
ఎంతగా నుండెనో యిప్పు డెవని కెఱుక!

# సూతాశ్రమ భాషితములు II

## ఆంధ్రరాష్ట్రము : అగచాట్లు

శ్రీ కవిరాజు

ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలయునని నేఁడు 'ఆంధ్రులు' తెలుఁగు నాఁటి నాల్గుమూలలనుండి గగ్గోలు లేవనెత్తుచున్నారు. వీరి గగ్గోలు నాయకులకు బధిరశంఖారావము అయ్యెను. నాయకు లప్పుడప్పుడు సుషుప్త్యవస్థనుండి యులికిపడి లేచి, నాది కాదు తప్పు, వారిది కాదు తప్పని పత్రికలలోఁ బ్రచురించుట మాత్రము కానఁగుచున్నది. వీరిట్లాత్మ గౌరవమును గోల్పోయి ప్రచురణలు జేయుటకుఁ గారణ మేమియో మన మూహింపవలసియున్నది. జనసామాన్యము, తమ కార్యవిధానమును శంకించుచున్నదని నమ్మి వీరిట్టి దారిఁ ద్రొక్కుచున్నారు. ఇంతమాత్రముచే నాంధ్రులు పరితృప్తు లగుదురా? ఇంతకుఁ బ్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు నిట్టి దురవస్థ ప్రాపించుటకుఁ గారణమేమి? ఆంధ్రుల యలసతయు, నుదాసీనతయు, ఆత్మవిశ్వాస శూన్యతయుఁ గాక మఱేమి కారణము లగును? దీనిం జూచియే కొందఱు అరవలు రవరవలతో నోటికివచ్చినట్లు మాటాడుటయు, చేతికివచ్చినట్లు వ్రాయుటయు నారంభించిరి. తెలుఁగునాఁటి యెల్లలు నిర్ధారించుఁగువాదములు చేయుచున్నారు. తిరుపతి దాఁకఁ దమిళనాఁడని యొకఁడు, అరవరా జొకఁడు రాజమహేంద్రపురమును బరిపాలించెఁ గాన గోదావరీ మండలము కూడఁ దమిళనాఁటిలోనిదే యని మఱియొకఁడును వ్రాయ సాహసించిరి. ఎవ్వరీ యరవరాజు? రాజరాజనరేంద్రుఁడు. వింటిమా కంటిమా మున్నెన్నఁడయిన యిట్టి దుర్వాదము! ఈ జాల్మల వాకట్టకున్న లాభములేదు. తెలుఁగు భారతము వ్రాయింపించిన రాజరాజనరేంద్రుఁ డరవవాఁడట! ఆహా!! ఏమి యీ మనఃప్రవృత్తి!!! చోళరాజ్యంబేలిన రాజును గోదావరీమండలమును బరిపాలించిన ప్రభువును చుట్టములయినంత మాత్ర రాజరాజనరేంద్రుఁ డరవ యెట్లగును? ఇంతకుఁ జోళరాజ్యంబును బరిపాలించిన రాజు ద్రవిడుఁడని యెన్నఁ డెట్లు నిర్ధా

గింపఁ బడెను! విదేశీయుఁడు కాఁడా? అరవలు తెలుఁగు దేశమును బరిపాలించినట్లు నేఁటి కేమయిన నిదర్శనము లున్నవా? అడియాలము లేమయిన కలవా? తెలుఁగుదేశమున నరవలు కట్టించిన గుళ్ళు గోపురములున్నవా? అరవ గ్రామము లున్నవా? త్రవ్వించిన దటాకము లున్నవా? కట్టించిన యానకట్ట లున్నవా? ఇచ్చిన యగ్రహారము లున్నవా? మడిమాన్యము లున్నవా?

ఈ ద్రావిడ దుర్వాదమునే యాధారముఁ జేసికొని పరిస్థితులను బరికించితిమేని యేమి బయల్వడునో పాఠకులు తిలకింతురు గాక! ద్రావిడ దేశమంతయుఁ దెలుఁగువారి కాఁగాచియుండిన రుజువుచేయు నెన్ని నిదర్శనములున్నవో కదా! ఒక్క ద్రవిడదేశ మననేల? వేలకొలఁది సంవత్సరములు సింహళద్వీపమును దెలుఁగువారు పరిపాలింపలేదా? చేరదేశము తెలుగువారి పాదాక్రాంతము కాలేదా! తంజావూరు, రామనాడు, తిరుచునాపల్లి జిల్లాలు తెలుఁగువారయిన తంజావూరు నాయకరాజుల క్రింద నెన్ని వందల సంవత్సరము లుండలేదు? మధుర, తిరునల్వేలి జిల్లాలు తెలుఁగువారయిన మధురనాయకులకు నెన్ని వందల యేఁడు లడుగులకు మడుగులొత్త లేదు? మధురాపట్టణము కట్టించిన దెవ్వరు? తెలుఁగువాఁడయిన విశ్వనాథ రాయలు కాదా? మధురలో నేఁటికి యాత్రికులకు దిగ్భ్రమ గొల్పు తిరుమలనాయకసౌధ మెవ్వరు గట్టించిరి? కావేరి కానకట్ట కట్టించి ద్రావిడులకుఁ గూడు గుడ్డ నిచ్చి కఱవు లేకుండఁ జేసిన దెవ్వరు? సివ్వప్పసాగర మెవ్వరు త్రవ్వించిరి? రాజుపాలెము మొదలగు పల్లెటూళ్ళ నెవ్వరు నిర్మించిరి? తంజావూరు జిల్లాలో తటాకములు, నీటికాలువలు నెన్నిటిని తెలుగువారు త్రవ్వించలేదు? సప్తసంతానము లెన్ని తెలుఁగు బిడ్డల పేర నేటికిని వెలయుటలేదు? ఇవన్నియుఁ జారిత్రకులకుఁ దెలియవా? పుదుక్కోట యెవ్వరి రాజ్యము? ద్రావిడుల ముల్లెయా? పుదుక్కోట రాజయిన కోట రఘునాథునిపైఁ జెప్పబడిన (తెలుఁగు) జావళీలు తెలుఁగుదేశమున నిప్పటికిని నెన్ని ప్రచారములో నున్నవి? పుదుక్కోటరాజు తెలుఁగుకవి కాఁడా? పార్వతీపరిణయమును రచించిన కవి యెవ్వఁడు? చారిత్రకులు వీని నన్నింటి నెరుంగరా? చేరదేశము (కేరళము) ఆంధ్రుల కైవసమున నుండలేదా? గోళ్ళ రామప్పనాయుఁడు చేరసేనలఁ జిందరవందరఁ జేసి కేర

శమును (మలయాళమును) పాదాక్రాంతముగాఁ జేసికొనలేదా? క్రీస్తు శకమునకుఁ బూర్వము రెండవశతాబ్దినుండి నిన్న మొన్నటిదాఁక సింహళమును బరిపాలించిన విజయవంశము తెలుఁగు వంశము కాదా? ఈ వంశము కాంచీ (కందపురము) రాజులన విఖ్యాతి గన్నది. ఈ వంశములోఁ గడగొట్టు రాజు బందియై నేఁడు తంజావూరున నున్నాఁడు. చరిత్రక దృష్టాంతము లిన్ని యుండఁగా నీ యగవవాదము యరవపేచిగాక యేమగును? ఇట్టి యాంధ్రుల కడుపునఁ బుట్టి పట్టి గరాసులైన నేఁటి తెలుఁగువారికిఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రమేల? చేతులు జోడించి 'భవతి భిక్షాం దేహి' అని యాచించిన నీ సామ్యవాదయుగమున నూరక యాదరించి భిక్షనిడువా రుందురా! నేఁటి తెలుఁగువారికి భిక్షాపాత్ర యొక్కటే యలంకారప్రాయముగా నుండ దగినది.

తెలుఁగుసింహము గర్జించుట మాని గుహాలయందు మారుమూలల డాగెను. కేసరంబు లుపవీతంబులయి రాలిపోవుచుండెను. కోదమసింగములు రంగస్థలమున కురుకుట లేదు. రాజ్యంబులేలిన రాజసింహంబుల కడుపునఁబుట్టిన వాఁడు భట్టరాచార్యుని బట్టయ్యెను. ఇంకెక్కడి రాష్ట్రనిర్మాణము? ఇంకెక్కడి ప్రత్యేకాంధ్రరాష్ట్రము?

# ఆంధ్రాష్టకం!

శ్రీ వేంకట పార్థసారథి కవులు

బెంగాలీ ప్రేమ లేకుంటే
కలం కదను తొక్కదు
హిందీట్యూషన్ని దోపందే
సినిమా రచ్చ కెక్కదు

ఏ 'జట్టో' 'చందా' పెట్టందే
పేరు గౌరవపాత్రమా?
బెంగాలీ లాల్చి పైజామా
లేనివాడు మనుష్యుడా?

శాంతఆస్టేయె మా లక్ష్మి
సుభాషే మాకు దేవుడు
మా వాళ్ళు వట్టి దవ్వాలు
మాకు గిట్టరు గిట్టరు!!

అందమైనది హిందీనే
తెలుగా షెగులా యిది?
మాతృభాషా భ్రాషై ఏమయ్యా?
ఎప్పుడూ అమ్మ చావదా!

సుందరయ్యారు సాంబారు
సర్వపాప వినాశనం
మరాటీల చపాతీలు
భలే రుచి భలే రుచి!!

అడిగేను ద్రావిడస్వామీ !
నొ మొష్కార్ బంగబాసికి
ఆదాబరజ్ ముసల్మాన్ భాయ్ !
ఆంధ్రులం మేము ఆంధ్రులం !!!

" క్యాహై జి, ఆంధ్ర క హైతో ?"
" ఆంధ్రా యెన్గిర యెన్నదు ?"
ఎందు కీ ప్రశ్న లన్నిని ?
చాళ్లా ? ఊసర వెల్లిని

దత్తులై దత్తుపోవాలి
సందుబట్టాలి చఁదులై
ఘోషులై ఘోష పెట్టాలి
ఆంధ్రీత్వం అప్పుడేకదా ?

—* ఫలశ్రుతి *—

ఇది ఆంధ్రాష్టకం దీన్ని
జపించండి త్రిసంధ్యల
ఆంధ్రత్వం పూర్తిగా మీకు
అబ్బుతుంది నిజం నిజం

# ఆంధ్రరాష్ట్రము - అనంతశయనము

మురళీచంద్

ఆంధ్రరాష్ట్రోద్యమము వెలసినది గుంటూరుమండలములో. ఉద్యమ పితామహుడు- దేశభక్తుడు కొండ వెంకటప్పయ్య పంతులు ఆవిర్భవించినది అచ్చటనే. అంటే, ఆ ఉద్యమమునకు అంకురార్పణ జరిగినది గుంటూరుమండలములోనే. 1913 సంవత్సరములో ఇచ్చట జన్మించి తెలుగుదేశము మూలమూలల సంచారముచేసి జస్టిస్, కాంగ్రెసు ప్రభుత్వములతో కలిగిన సంరంభములతోను, సంప్రదింపులతోను పెరిగి పెద్దదై యావద్భారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి దృష్టి కూడ తనవైపుకు మఱల్చుకో కలిగినది తన సమస్య యావద్భారత సమస్యగా చేయజాలినంత బలసంపద ఆర్జించుకొన్నది. ఇట్టి తరుణములో రాష్ట్రలబ్ధికై జన్మస్థానమగు గుంటూరులో జన్మదాత అనదగు కొండ వారి యాజమాన్యమున ఆంధ్రసభా సమావేశము జరుపబడుటకు ఆంధ్రులెల్లరు సంతోషించిరి. అధ్యక్షసార్వభౌముని కొఱకు దేశముమూల మూలల వెదకిరి పర్యవేక్షణ చేయగా చేయగా (వలదన్న ఒకరిద్దరు పోను) చిట్టచివరకు అనంతశయనమే వరణీయ వ్యక్తి అని తోచినది. వెంటనే ఇరువదారేండ్ల పడుచుపాయపు రాష్ట్రశిశ్వను కన్నతండ్రి దేశభక్తుడు స్వీయహస్తములో అనంతశయనము భుజాస్కంధముపై ఇదమని సమర్పించినాడు. గుంటూరులోని ఆహ్వానసంఘమువారు మహోమతులై జయ జయలు పెట్టినారు. కన్నబిడ్డను, గారాబుతండ్రి గావున అనంతశయనము భుజాస్కంధముపై శయింపజేసి దేశభక్తుడు కన్నుమోడ్చినాడు.

అనంతశయనము రాష్ట్రవాది కాకపోవుగాక ఆ సంబంధమైన తీర్మానములకు అడునప్పుడు వ్యతిరేకముగ భాషించు గాక! ప్రత్యేక రాష్ట్రము ఆంధ్రులకు అక్కరలేదనువారియెడ సానుభూతి చూపుగాక! తిరుపతి దాక మాదేనని ప్రచారముచేయు ద్రవిడులను "శ్రీ తాన్నమః" అని అర్ఘ్యపాద్యాదులొసంగి ఆదరించుగాక!

అనంతశయనము భారత శాసనసభాసభ్యుడు గనుక, మద్రాసు ప్రధానికి ఆంతరంగిక మిత్రుఁడు గనుక, దత్తమండల నివాసి గనుక, అనూచానమగు అన్వయప్రతిష్ఠ కలవాఁడు గనుక, వయోవృద్ధు గనుక తాతగారైన దేశభక్తుఁడు అనంతశయనమే వరణీయవ్యక్తి అని ఆంధ్రరాష్ట్ర ప్రతిష్ఠ నిలబెట్టినాఁడు.

"చాలకాలంబు వోవక చతురులైన వృద్ధజనముల బుద్ధులు విండ్రుగాక" అని ఎప్పుడో తిక్కనసోమయాజి తన భారతములో చేసిన ప్రసంగము అశీతి వృద్ధుడైన మన దేశభక్తునియందు అన్వయించ దని దేశీయులకు ఇప్పుడు వెల్లడి అయినది. దేశభక్తుడు పలితకేశుడే కాని పలితాత్ముఁడా మఱి అను మహాధ్వని చెలరేగినది.

రాష్ట్రలబ్ధికి మద్రాసుప్రధాని బాసట తప్పనిసరి గనుక తన్మిత్రము అనంత శయనము అది సంపాదించును.

దత్తమండలము కొంచెము ఎడమొగము పెడమొగముగా ఉన్నది కాబట్టి తన్నివాసి అనంతశయనము అది సరిచేయును.

గోదావరిదాక మాదేనని అరవలు పైపైకి వచ్చుచున్నారుగనుక తన్నామ ప్రత్యయమగు అయ్యంగార్ అను శబ్దమాత్ర వ్యవహారముచేతనే వారిని చల్లపరుచును.

రాష్ట్రతీర్మానము శాసనసభా ద్వారముననే కార్యరూపము ధరించవలె గనుక తత్సభా సభ్యత నందిన అనంతశయనము అది సకాలములో ప్రారంభించును.

ఇన్ని మహావిశేషములు గల వ్యక్తి గనుకనే అనంతశయన మయ్యంగారిని అర్హుడని అఖిలాంధ్రమహాసభకు అధ్యక్షపరమేశ్వరుని చేసిరి. తద్ద్వారా గుంటూరుపుర ప్రముఖులకు ఆంధ్రరాష్ట్ర విషయమై తమకుగల తహతహను సార్థకరించుకొనిరి.

నమో నమః

# అక్కచెల్లెళ్లు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

శ్యామల బడినించి వచ్చేటప్పటికి సుందరి వంట పనిలో నిమగ్నురాలై ఉంది. మల్లెపువ్వు వంటి చీర కట్టుకుని, నిగనిగా మెరిసే శరీరచ్ఛాయతో బంగారపు బొమ్మల్లే తన చెల్లెలు వంట చేస్తూండటం కళ్ల పడగానే శ్యామల మనస్సు ఒక్కసారిగా పొంగిపోయింది. ఆ క్షణంలో ఆమె సుందరిని ఇంచుమించు మగవాడు ప్రేమించినట్టు ప్రేమించ గలిగింది—మగవాడి ప్రేమలో ఉండే ఉద్రేకం మినహాగా.

క్షణికంగా కలిగే ఇటువంటి మనోవికారాలకు కారణం ఎవరు చెప్పగలరు? అటువంటి జిజ్ఞాస చేసే పని మనస్తత్వ వేత్తలది. శ్యామల గడిచిన ఏడెనిమిది సంవత్సరాల కాలంలోనూ మగవాణ్ణి ఎంత పరిపూర్ణంగా అనుభవంలోకి తెచ్చుకున్నదంటే, ఆమె కిప్పుడు సగం మగవాడి మనస్తత్వమే ఏర్పడి ఉన్నా ఉండవచ్చును. స్త్రీలో మగవాణ్ణి ఆకర్షించే దేమిటో ఆమెకు బహు సూక్ష్మంగా తెలుసును.

ఆమె తనలో తాను నవ్వుకుని, 'మా సుందరిని ఈ చూడటమే మగవాడు చూస్తే ఎంత ఉద్రేకానికి లోనై ఉండును!'' అనుకున్నది. ఒకప్పుడామెకు తన స్త్రీత్వం తన కర్థమయ్యేది కాదు. పురుష సంపర్కం కలిగే వరకూ ఆమెకు సెక్సు (sex) సంబంధించిన స్వస్వరూప జ్ఞానం ఏమీ ఉండేది కాదు. కాని అనుభవం ఆమె కాజ్ఞానం ప్రసాదించింది. నైతిక దృష్టిలో ఆ అనుభవం శోచనీయమైనదే కావచ్చును. కళాదృష్టిలో చూడగలిగితే ఆ అనుభవంలో వేలుపెట్టి చూపదగిన లోపం లేదు. అది అంత అందమైనది, అంత పరిపూర్ణమైనది, లక్షమంది స్త్రీలలో ఒకతెకుకూడా లభ్యం కానిది. ఆ ఒక్కతెనూ ఆ అనుభవం తలుచుకుని సిగ్గుపడమంటే పడదు; అది చూసి గర్వించకుండా ఉండలేదు.

శ్యామల తన అవినీతికరమైన అనుభవానికి అపరిమితంగా గర్వపడ్డది. కళాభిజ్ఞుడైన నటుడు తన కళాప్రదర్శనం ప్రేక్షకుల హృదయాలలో కలి

గించే చైతన్యాన్ని సరిగా చూడగలిగినట్టు, శ్యామల తన స్త్రీత్వప్రద ర్శనం పురుష హృదయాలలో సరిగా ఎటువంటి చైతన్యం కలిగించేదీ చూడనేర్చింది. అదే స్వస్వరూపజ్ఞానం.

ఆ జ్ఞానం ఇతర స్త్రీలను అంచనా కట్టటానికి కూడా ఉపయోగపడి తీరుతుంది. సుందరి జన్మతహా తనకన్న చాలా అదృష్టవంతురాలు. భగ వంతుడామెకు తనకన్న అధికమైన సౌందర్యమే కాక, అంతకంటె కూడా ముఖ్యమైనది అధికమైన ఆకర్షణశక్తి ప్రసాదించాడు. తాను ప్రయత్న పూర్వకంగా చెయ్యవలసినది తన చెల్లెలికి సహజంగా అబ్బుతుంది. పురు షుడికి సుఖం ఇవ్వట మనే మనోహరమైన అనుభవం తన కంటె కూడా మరింత పరిపూర్ణంగా పొందగలదు సుందరి—ప్రయత్నిస్తే! కాని సుందరి ప్రయత్నించదు: ఆమె మనస్సు అటు వెళ్లనే వెళ్లదు. అందుకు శ్యామల చాలా నొచ్చుకున్నది.

నేను శ్యామలను సమర్థించి నలుగురినోటా నానబోవటంలేదు. ఆమెను సమర్థించటం నాపని కాదు, ఆమె వ్యక్తిత్వాన్ని విపులీకరించటమే. నైతికంగా ఆమెకూ ఒక తాగుబోతుకూ తేడాలేదు. తాగుడులో కేవ లమూ నిషా మాత్రమే కాక ఆనందంకూడా ఉందని ఎవరైనా ఒకరు తెలుసుకోవటం కద్దు. అటువంటివాళ్లు తామెరిగిన వాళ్లను రెండు జాతు లుగా చేసి చూస్తూఉంటారు—తాగటానికి అర్హతలేనివాళ్లూ, తప్పక తాగవలసిన వాళ్లూ' తప్పక తాగవలసిన జాతిమనిషికి తాగుడు ధ్యాసే లేక, అదిఅంటేనే గిట్టకపోతే వాళ్ల మనస్సు నొచ్చుకుంటుంది. శ్యామల కూడా అంతే. ఒకవిధంగా ఆమె అపూర్వమైన అదృష్టవంతురాలు. లోకం అంతగా అసహ్యించుకునే జారత్వంలో ఆమెకు పశ్చాత్తాపం కలి గించే అనుభవం ఏమాత్రమూ కలగలేదు. ఆమెకు స్త్రీ పురుష సంబంధం అతి పవిత్రమైనదిగానూ,అందులోఉన్న ఆనందం అత్యుత్తమ మైనదిగానూ తోచటంలో వింతలేదు. చిన్నతనంలో పెద్దలవల్ల నేర్చుకున్న నీతి పాఠా లామెకు సహజంగా అర్థం లేనివై పోయినై. మనం పుస్తకాలలో చదివిన విషయాలనూ ఇతరులవల్ల తెలుసుకున్న విషయాలనూ పురస్కరించుకొని కలిగే విశ్వాసాలు అనుభవంవల్ల ఆ మాత్రం సంస్కారం పొందకపోయి నట్టయితే అనుభవం యొక్క ప్రయోజన మేమిటో నాకు తెలియదు.

శ్యామలను గురించి ఒక్కముక్క అనటానికి మాత్రం నాకు సాహసం లేకపోలేదు: అవినీతి ద్వారా ఆమె సంపాదించిన ఈ మధురమైన అనుభవం ఆమెకు భర్తవల్ల కలిగిఉంటే శ్యామల సీతా సావిత్రీ మొదలైన పూర్వ స్త్రీల శ్రేణిలో చేరి ఉండును.

చిత్రమేమిటంటే అటువంటి ఆనందం ఆమెకు ఆదిలో ఇచ్చినవాడు ఆమె భర్తే. కాని, పాపం, అతను దక్కలేదు; శ్యామల కాపరానికి వెళ్లిన రెండవ సంవత్సరములోనే కలరా తగిలి పోయినాడు. తరవాత నాలుగు సంవత్సరాలపాటు ఆమె పరపురుషుణ్ణి ఎరగదు. ఈలోపుగా ఆమె మెల్లగా కొంత ఇంగ్లీషు చదివి, ఒక చిన్న పరీక్ష ప్యాసయి, ట్రెయినింగు చదివి పంతులమ్మ ఉద్యోగం సంపాదించింది. అప్పటినించీ ఆమె జీవితంలోకి పర పురుషులు ప్రవేశించారు. అదైనా నియమితంగా ఎవరో ఒకరే కాక పోవటానికి దేశంలో ఉన్న నీతి విశ్వాసాలే కారణం. కాని ఆమె ప్రణయాలలో ఎప్పుడూ కల్మషం గాని, కపటం గాని, కృత్రిమమైన నటన కాని లేదు. ఆమె జీవితంలో జోక్యం చేసుకున్న పురుషులు కూడా అదృష్టవశాత్తూ ఆమెను ఆవిధంగా ప్రేమించినవాళ్లే.

"నేను అపరూపపు అందగత్తెను కాకపోవటంవల్ల నన్నెవ్వరూ ప్రేమించకుండా వాంఛించరేమో!" అనుకునేది శ్యామల. ఆమె తన ప్రియుల నెవరినీ మరవలేదు—తన భర్తను కూడా...

సుందరి శ్యామల దగ్గరికి వచ్చినాలుగు రోజులే అయింది. ఈ నాలుగు రోజులనించీ శ్యామల ఒక కొత్తరకం ఆనందం అనుభవిస్తున్నది. అటువంటిది శ్యామలకు ఇతరులవల్ల కలగనేలేదు సరేకదా, తన చెల్లెలివల్లకూడా ఎన్నడూ కలిగిఉండలేదు.

అంతదాకా దేనికి, ఈ సుందరికి తనకూ ఒకప్పుడు ఎంతమాత్రము పడేది కాదు. ఎప్పుడూ కీచులాడుకొనేవాళ్లు. "మీరు అక్కచెల్లెళ్లు కాదమ్మా! సవతులే, తల్లీ!" అని వాళ్లమ్మ తెగ విసుక్కునేది. అయిదారేళ్లయిన తరువాత కనపడి సుందరి శ్యామలలో ఉన్న మాతృత్వాన్నంతా పైకి తెచ్చింది.

నిజానికి పరిస్థితులు అట్లా ఒనగూడినై. ఈ అయిదారు సంవత్సరాల కాలంలో, పాపం, సుందరి ఎన్నివిధాల కష్టాల పాలయింది! ఆమె కాపరా నికి వెళ్ళి అయిదు సంవత్సరాలు దాటింది. శ్యామల తన చెల్లెల్ని కిందటి సారి అదేచూడటం. కాపరానికి పోయినప్పటినించి సుందరి సౌఖ్యంఎరగదు. ఆమె భర్తకూ అతని తండ్రికీ ఒకక్షణం పడేదికాదు. ఒక తండ్రేఏమిటి? సుందరి భర్తకు ఇంటిల్లిపాదీ విరోధులే. అతని మీది కోపం సహజంగా సుందరి మీదకూడా తిరిగింది. ఆమెను అత్తవారు దాసికన్న కనాకష్టంగా చూసేవారు.

ఇక సుందరి భర్తవల్ల ఏ మాత్రమైనా సుఖంపొందితే ఆమె అప్పటి జీవి తాని కదేసుఖం. అదయినా దక్కిందా? ఆమెభర్త నాలుగు సంవత్సరాల క్రితం ఇంటోవాళ్ళందరితోను హోరాహోరి పోట్లాడి ఒకరాత్రివేళ చేతి కందిన నగలూ డబ్బూ తీసుకొని వెళ్ళిపోయినాడు. మళ్లీ అతని జాడ తెలియదు. అతను లేచిపోయినా నెలరోజులకే సుందరి అత్తవారిల్లు భరించలేక పుట్టింటికి వచ్చేసింది. పుట్టింటి దగ్గిరకూడా సుందరికి విరామం దొరకలేదు. ఆమె అన్నలు ఆమెచేత రిజష్టరు నోటీసు లిప్పిస్తామనీ మనో వర్తిదావాలు వేయిస్తామనీ కూర్చున్నారు. వారిడబ్బు కక్కుర్తి సుందరికి అసహ్యం వేసింది. కాని ఎట్లాగో ఒక సంవత్సరంపాటు పుట్టిల్లు భరించి ఆ తరువాత మళ్లీ ఆమె అత్తింటికి వెళ్ళింది, ఏకష్టాలయినా అక్కడే పడ దామని. జరిగిన మూడుసంవత్సరాలూ సుందరి అత్తవారింటనే గడపింది. ఎట్లాగడపిందో ఆమెకే తెలియాలి.

ఆఖరుకు సుందరి తన అక్కకు ఉత్తరం రాసింది, తన అగచాట్లన్నీ చెప్పు కుని. శ్యామల నాలుగురోజుల క్రితం ఆమెను తనదగ్గిర తెచ్చిపెట్టుకుంది. సుందరి పాట్లను గురించి ఆమెకు దాదాపు ఏమీ తెలియదు. తను తెచ్చు కుంటున్న ఈ పాతికరూపాయలూ తనకున్న ఈ కాస్తస్వేచ్ఛా తనకు అయినవాళ్లు హరించగలరని తెలిసి శ్యామల అజ్ఞాతవాసం చేస్తున్నది, అందరితోనూ సంబంధాలు తెంచుకుని. సుందరి ఉత్తరం ఆమె రాయి చేసుకున్న మనస్సును ద్రవింప చేసింది......

ఈ నాలుగు రోజులనించీ శ్యామల సుందరిని జాగ్రత్తగా గమనిస్తున్నది. సుందరి తత్వం ఆమెకు బోధపడలేదు. ఆమె భర్తకోసం దిగులుపడు

తున్నదా? సుందరికి మగజాతిని చూస్తే పరమ అసహ్యమని ఒకటి తెలుసుకో గలిగింది శ్యామల. ఆ అసహ్యతకు పునాది ఏమిటో తెలియ లేదు. ఒక వేళ ఆమె మొగుడివల్ల అనుభవించిన సౌఖ్యం విస్మరించు కుంటూ వైరాగ్యకోరణిలో పడిపోయిందా? లేక భర్త తనను విడిచి పెట్టి పోయినందున మగజాతిమీద ఆమెకు పగగా ఉందా?

సుందరిని అర్థం చేసుకోవటం వల్ల శ్యామలకు ప్రత్యేక ప్రయోజనం ఉంది: సుందరి ఎదుట తను ఎట్లా ప్రవర్తించవలసిందీ తేలాలి. ఏ కారణం వల్ల కాని తనమూలకంగా సుందరి బాధపడటం కాని ఆమెకు జుగుప్స కలగటం కాని శ్యామలకు ఏమాత్రము ఇష్టంలేదు.

అయితే సుందరి సుఖపడేమార్గం ఏదయినా ఉంటే దానికి తను అడ్డం ఉండటం ఏ మాత్రమూ ఇష్టంలేక పోగా తగిన ప్రోత్సాహం ఇవ్వాలని కూడా ఉంది శ్యామలకు. ప్రస్తుతం శ్యామల సమస్య ఏమంటే సుందరి మనస్సు ఏమాత్రమూ నొప్పించకుండా ఆమె మానసికస్థితి తెలుసుకోవటం అది సాధించేమార్గం శ్యామలకు ఏమాత్రమూ కనిపించలేదు.

''ఏమే, అక్కా? వంటయింది. భోంచేస్తావా?'' అన్నది సుందరి. ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. సుందరి మామూలుకన్న పరధ్యానంగా ఉన్నట్టు శ్యామల అనుమానించింది, కాని ఏమీ అనలేదు.

అకస్మాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినదాని మోస్తరుగా సుందరి ''అన్నట్టు నీకోసం ఎనిమిదిన్నర గంటలప్పుడెవరో వచ్చారే! సుబ్బారావో ఎవరోట! తెలుసునా?'' అన్నది.

''ఏ సుబ్బారావో! అంత ఎక్కువ తెలిసినవాడై ఉండడు. ఎనిమిదిన్నర గంటలప్పుడు నేను బడిలో ఉంటానని సామాన్యంగా నన్నెరిగినవారందరూ ఎరుగుదురు. ఏంపనిట''

''ఏమో, నాకేమీ చెప్పలేదు.''

సుందరిని చూసి శ్యామల ఆశ్చర్యపడ్డది. తనకు ఆ వచ్చినవాణ్ణి గురించి ఆలోచించటానికి ఏమాత్రమూ ఇష్టంలేనట్టు సూచించటానికి ఆమె అంత ప్రయత్నం చెయ్యటం దేనికి? ''సుబ్బారావో, ఎవరో.'' సుందరి ఆ పేరు

తనకు జ్ఞాపకం సరిగా లేనట్టు నటించటం అంతా తప్పుగా ఉంది శ్యామలకు. అక్కడితో ఆ విషయం అయిపోయింది.

సాయంకాలం రెండు మూడు ముప్పావుకు శ్యామల మళ్లీ బడికి వెళ్ళి పోయింది. మూడింటికి ఆ సుబ్బారావు మళ్ళావచ్చాడు పంతులమ్మగారున్నారా అంటూ.

సుందరి గుమ్మంలో నిలబడి అతనికేసి ముఖంచిట్లించి చూస్తూ లే రన్నది. ఆ సుబ్బారావు వచ్చిన పని అయిపోయింది. కాని అతను వెళ్ళడు. సుందరి ఆ గుమ్మందగ్గిర్నించి కదలదు. అతనికేసి చూడడం మానదు. చూసేది ఏమాత్రమూ ఇష్టం ఉన్న దానల్లే చూడదు. పరమ అసహ్యంగా మొహం చిట్లించుకుంటుంది. అతన్ని పంపదు. అతను అక్కడ ఇంకా ఎందుకున్నాడు అర్థంచేసుకున్నట్టా, చేసుకోనట్టా? అతని ప్రవర్తన ఆమెకు నచ్చినట్టా, నచ్చనట్టా?

శ్యామల నీతికలది కావచ్చును. కాని ఆ క్షణంలో ఆమె చెల్లెల్ని చూస్తే చాలా అసహ్యంకొని ఉండేది.

ఈ లోపల సుబ్బారావుగుండెల్లో రైళ్లు పరిగెత్తుతున్నై. కాని అతని మనస్సుమాత్రం భీమబలంతో అతన్ని ఆమెవైపు లాగుచున్నది. ఇద్దరు మహాబలశాలులు అర్భకుణ్ణి చెరొకవైపూ లాగుతుంటే వాడు ఎటూ కదలకపోయినప్పటికీ యమబాధ పడ్డట్టు, సుబ్బారావు తలవాకిలి లోపలిగా నిలబడి బయటికిపోలేడు, లోపలికి సాహసించి రాలేడు; అక్కడే ఉండి అనివార్యంగా బాధ పడుతున్నాడు.

సుందరి ఎటో ఒకవైపు వాణ్ణి లాగో సెట్టో వాడిబాధ నివారణ చెయ్యదు. తలుపు దఢాలున వేసుకుని తాను వెళ్ళిపోయినా లేక వాడిబాధకు జాలి పడి నవ్వుతూ పలకరించినా, మరొక ఆశగొల్పినా వాడికి మోక్షం ఉండును. ఆమె ఏదీ చెయ్యదు.

సుబ్బారావు చివరకు సాహసించి తలవాకిలి తలుపుదగ్గిరగా చేరదీసి ఆమెను సమీపించాడు, తాను ఏమీ గమనించనిదానల్లే సుందరి ఇంకా మొహం చిట్లిస్తూనే లోపలికివెళ్ళిపోయింది. సుబ్బారావు ఫాక్టరీమాదిరిగా కొట్టుకు లాడుతున్న హృదయంతో ఆమెను సమీపించి ఆమెఎదట నిలబడ్డాడు.

సుందరి వాడివంక మరింత తీవ్రంగాచూసి మరొకపక్క గదిలోకి వెళ్ళి పోయింది.

సుబ్బారావు కళాశూన్యమైనసుందరి ప్రవర్తన ఇక భరించలేకపోయినాడు. అతను వెంబడించి ఆమెను పట్టుకున్నాడు.

సుందరి పులిమాదిరిగా అతనివైపు తిరిగి "ఏమిటీ పని? నీకు బుద్ధిలేదూ?" అన్నది.

సుబ్బారావుకు మొహాన గట్టిగా చరిచినట్టయింది. అతను పెద్ద అన్యాయం జరిగినవాడల్లే "ఆమాట ఇప్పుడా అడుగుతావు?" అన్నాడు. ఆమాట శ్యామల వినగలిగితే ఆమెగుండె ద్రవించిఉండేది.

"నేను పొద్దున నీకెదురుగా పావుగంటసేపు నుంచుంటే అప్పుడు తెలుసుకోలేకపోయినావా, నాకు బుద్ధిలేదని?" అన్నాడు సుబ్బారావు ఇంకా ఆగ్రంతులోనే. "ఈపూట నేను నీకళ్ళఎదట తలుపువేసి నీ వెంట లోపలికి వస్తుంటే అప్పుడే అడక్కపోయినావా? నాకు బుద్ధిలేదు. మరి నీకళ్లేమయినై, నీ స్త్రీ హృదయం ఏమయింది? నేను నీకోసం చచ్చిపోతున్నానని నీకు తెలియకపోయిందా? మీ వాకిలిముందుగా నాలుగు రోజులనుంచీ రోజుకు వందసార్లు ప్రదక్షిణం చేస్తున్నాను. అందులో కనీసం పదిసార్లయినా నీకంట పడుతున్నాను. నా ఉద్దేశం అకస్మాత్తుగా ఇప్పుడే తెలిసినట్టు నటిస్తావా!"

"ఇది చాలాబాగాఉంది. నా కిటువంటి పను లసహ్యం. నన్ను వదలిపెట్టు!"

"నేను వదలను, నాకు నిజంగానే బుద్ధిలేదు. ఉంటే ఈ కాసేపటిలో నీమీద అసహ్యం కలిగి ఉండవచ్చును. నాకింకా నీమీద భ్రమ పోవటం లేదు. అందుకని ఇంకొక బుద్ధిలేనిపనికూడా చెయ్యబోతున్నాను. నీకు డబ్బిస్తాను. రేపు పాతికరూపాయలు తెచ్చియిస్తాను నువు ఒప్పుకుంటే!"

సుందరి ఒప్పుకుంది, కాని ఆ ఒప్పుకోవటంలో నాజూకేమీలేదు. ఆమెకు అతనిస్పర్శ పరమఅసహ్యం అయినట్టూ, అతను తనను అబలనుచేసి బలాత్కరిస్తున్నట్టూ ప్రవర్తించింది. ఆమె నోటివెంట "ఏబ్బే! ఛీ! ఛూ! పాడూ!" అనేమాటలు తప్ప మరొకటి రాలేదు.

సుందరి కిది మొదటి అనుభవంకాదని భావించవలసిఉంది, సుబ్బారావుకూ కాదు. కాని అతను సుందరిని చూసినప్పుడు ఆమె దేవత అనీ తాను పూర్వం ఎరగనిజాతి అనీ అనుకున్నాడు. ఒక పాతికరూపాయలు వది లించుకుని సుందరితో నాలుగురోజుల పరిచయం సంపాదించేటప్పటికి అతని పాపం పండి మనస్సు విముఖత్వం చెందింది.

అతను చిన్నవాడు, ఆదర్శాలుండీన్నీ వాటికి ఆచరణరూపం ఇవ్వలేని దౌర్భాగ్య జీవులలో ఒకడు. అతను సుందరి అనుభవం కుతికలకుంటగానే జరిగినదంతా విపులంగా ఒక వుత్తరం రాసి శ్యామలపేర పోస్టుచేసి తన సుఖస్వప్నాలమీద పేడనీళ్ళు చల్లినందుకు సుందరిమీద పగతీర్చుకున్నాడు. ఆ ఉత్తరం శ్యామల హృదయానికి గొడ్డలిపెట్టయింది. సుబ్బారావు వ్యక్తీకరించిన లక్షణాలన్నీ సుందరిలో ఉండటానికి అవకాశం ఉందని శ్యామల ఇప్పుడు సులభంగానే అర్థం చేసుకోగలిగింది.

తన దగ్గిరికి వచ్చిన కొత్తలో సుందరి తనకు అర్థంకాకుండా ఉండికూడా తనకు సన్నిహితురాలనిపించింది. తీరా ఆమె అర్థం అయేటప్పటికి తమ ఇద్దరిమధ్యా ఈ అగాధం ఎందుకుండవలసివచ్చింది!

ఇప్పటికీ శ్యామలకు సుందరిమీద అసహ్యంగాని కోపంకాని కలగలేదు, దిగులుమాత్రమే. తనరక్తం, తన ప్రతిబింబం—సుందరి తన కెందు కర్థం కాదు? తనకింత భేదించిందేం?

ఎవరుచెబుతారు? తనంతట తాను తెలుసుకోలేకపోయింది శ్యామల....
ఒకనాటిరాత్రి పదిగంటలు దాటినతరువాత వీధితలుపెవరో తట్టారు. శ్యామలకు అప్పుడే నిద్ర పట్టిందో లేక పట్టుతూ పట్టుతూఉందో—అంతే. తలుపుచప్పుడుకు ఆమెనిద్రమత్తు యావత్తూ వదిలిపోయింది. అంతకు పూర్వమే నిద్రపట్టినసుందరి గాఢనిద్రలోఉంది. శ్యామల చప్పుడుకాకుండా పక్కమీదినించి లేచి ఇవతలికి వచ్చేసింది. వచ్చినవారు తన స్నేహితు లెవరైనా అయిఉంటారని ఆమె సందేహం. సుందరి వచ్చినప్పటినించీ శ్యామల తనస్నేహితులను ఇంటికి రానివ్వటంలేదు.

శ్యామల తలుపుతీసి నివ్వెరపోయింది. తలుపు తట్టినమనిషి ఎవరో బిచ్చ గాడిమాదిరిగా ఉన్నాడు. ఆవెన్నెట్లో అతని ఆకారం దాదాపు భయం

కొలిపేటట్లుంది. అతని మొహాన వెలుతురుపడటంలేదు, కాని మాసిన గడ్డమూ లోతుకుపోయిన కళ్ళూ స్ఫురించుచున్నై. శరీరంమీది గుడ్డలు చాలామాసి అక్కడక్కడా చినిగిఉన్నై. అతనినించి చెమటా మట్టీ కలిసిన వాసనకూడా సూక్ష్మంగా వస్తున్నది.

"ఎవరు నువ్వు?" అన్నది శ్యామల కఠినంగా.

అతను అర్థంకాకుండా చెయ్యూపాడు. అతను పెదవులు కూడా ఏదో గొణిగినై. ఆమనిషి అసహాయ స్థితి చూసి శ్యామల జాలిపడి మృదువుగా "ఎవరు—ఏంకావాలి నీకు?" అన్నది.

కాసిని మంచినీళ్ళిప్పించండి," అన్నాడతను హీనస్వరంతో.

అతని మాటకు శ్యామల ఆశ్చర్యపడ్డది. అతని మాటలధోరణి నాగరికతనూ బ్రాహ్మణత్వాన్ని సూచిస్తున్నది.

"లోపలికి రండి!" అన్నది శ్యామల అప్రయత్నంగా.

అతను లోపలికి వచ్చి వరండాలో ఆగాడు. శ్యామల మరచెంబుతో మంచి నీళ్లు తెచ్చి యిచ్చింది. ఆ మనిషి ఒక్క గుక్కలో చెంబులో సగం పైగా తాగేసి మిగతావి ఆదుర్దాలో ఒంటినిండా పోసుకున్నాడు.

"నేను అన్నంతిని చాలారోజు లయింది" అన్నాడతను కొంచెం జీవం వచ్చిన గొంతుతో.

"పాపం! అన్నం పెడతాను లోపలికిరా!" అన్నది శ్యామల.

"వద్దు. ఇప్పు డన్నంతింటే చచ్చిపోతాను. ఆ మంచినీళ్ళు బాగున్నై, ఇంకాసిని తాగుతాను."

శ్యామల చెంబుతో మళ్ళీ నీళ్ళు తెచ్చింది కాని అతను ఎక్కువ తాగలేక పోయినాడు.

"మీ రెవరు?" అన్నది శ్యామల.

"నేను—నా పేరు వెంకట్రావు;" మీరు—

"వెంకట్రావా! ఏ వెంకట్రావు!"

"మీ పేరు శ్యామల కాదూ!"

"అవును!" అన్నది శ్యామల ఆశ్చర్యంతో.

"సుందరి—నాభార్య—ఇక్కడ ఉందని తెలిసింది. చూసిపోదామని—"
అతని నోరు కట్టుపడినట్టయింది. శ్యామల నోటివెంట అంతకుముందే మాట లేదు.

"వెంకట్రావు! సుందరి మొగుడు! ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు?"
అతను మాట్లాడ లేదు.

"పిచ్చివాడా, ఎంకకట్లా పారిపోయినావు? అయ్యో, ఈ కర్మమేమిటి? ఈ అవతారమేమిటి? ఇంతకాలం పట్టిందా నీకు పశ్చాత్తాప పడటానికి?" ఆ దౌర్భాగ్యుడిలో వెనుకటి ఆవేశం ఇంకాచావలేదు.

"నే నేమీ పశ్చాత్తాపపడలేదు." అన్నాడతను. తాత్కాలికంగా ఆహీన స్వరం బలిష్ఠమయింది. కాని మరుక్షణం ఆకాస్త హొంగూచల్లారి పోయింది. కళ్ళల్లోనికి వచ్చిన కాంతి తరిగిపోయింది. గొంతుమళ్ళా హీనస్వరంపడ్డది. అతను మొహానికి చేతులు అడ్డంపెట్టుకొని రెండు మూడుసార్లు గట్టిగా ఊపిరిపీల్చి "ఒక్క oదుకే పశ్చాత్తాపం. నేను సుందరికి అన్యాయంచేశాను. అదే నన్ను దహించేస్తున్నది. మేము ఎన్నడూ సుఖపడలేదు. ఒకప్పుడు చేతులోఉన్న సుఖాన్ని తృణీకరించాను. ఎంకకో చెప్పలేను. అప్పుడు నా కది ఎక్కువగా కనుపించలేదు. నా ఆశలు ఒకటీ ఫలించలేదు. ఆకళ్ళంతా సుందరికీ నాకూ మధ్య అడ్డంపెట్టాను. పాపం సుందరి ఏపాపం ఎరగదు. దాన్నిమనస్ఫూర్తిగా ఒక్కసారి కూడా సుఖపెట్టలేదు. నన్నూ దాన్ని కూడా అన్యాయం చేసుకున్నాను. భ్రష్టుణ్ణి."

శ్యామలకు ఒక్కసారిగా జ్ఞాన ప్రకాశం అయింది, సుందరి తత్వం యావత్తూ ఆమెకు అర్థమయి నట్టయింది.

"అయితే ఇప్పుడు మళ్ళీ సుందరికోసం వచ్చావా?" అన్న దామె.

"అవును. చూసిపోదామని—మాట్లాడు దామని—"

"ఇట్లాకాదు. ఈస్వరూపంతో నువ్వు సుందరికి కనిపించవద్దు. ఈ రాత్రి ఇక్కడే పడుకో ఈ సావడిలో పక్కవేస్తాను. నేను డబ్బిస్తాను. రేపు మంచి గుడ్డలు కొనుక్కో, ఆ జుట్టు కత్తిరించుకో. సాధ్యమైనంతవరకు నీ వెనకటి అవతారంలో రా, రేపు రాత్రికి. సరా?"

వెంకట్రావు శ్యామల ఇచ్చిన డబ్బు తీసుకుని ఆ రాత్రి అక్కడే పడుకుని తెల్లవారుజామునే వెళ్ళిపోయినాడు. మర్నాడు రాత్రి శ్యామల అతని కోసం మేలుకుని కూర్చున్నది. అతను రాగానే తలుపుతీసి అతన్ని లోపలికి పంపి తను వరండాలో కుర్చీలో పడుకుని అస్పష్టమైన ఆలోచనలో పడ్డది. అయిదు నిమిషాలలో అతను బయటికి వచ్చాడు, తలవంచుకుని బయటికి వెళ్ళిపోతున్నాడు. శ్యామల చివాలున కుర్చీలో నించి లేచి అతన్ని వెంబడించి కలుసుకుని "ఏం?" అన్నది.

"నన్ను సుందరి గుర్తించ లేదు," అన్నాడు.

"నిన్ను గుర్తించి ఉండాలి. గుర్తించక పోవటం అసంభవం."

"నాకు తెలుసును. దానికి నే నక్కర్లేదు. నేను చేసిన ద్రోహాన్ని అది క్షమించ లేదు."

శ్యామల ఆవేశంతో "ద్రోహం! క్షమ! ......మూర్ఖుడా, దాని కెంత అపకారం చేశావో నీ కిప్పటికైనా అర్థమయిందా? దాని జన్మకు సంసార సుఖ మంటే ఏమిటో అర్థం కాకుండా చేశావు! తెలిసిందా? ఈ జన్మకు దాన్ని ఎవరూ ప్రేమించరు, అది ఎవరినీ ప్రేమించలేదు. నీ కర్థమవుతున్నదా? ఇక ప్రకృతి కూడా దాన్ని ప్రేరేపించ లేదు. దానిలో ఉన్న ప్రకృతిని కనపడకుండా కాస్త కాస్తే గిల్లేశావు. నీ కర్థమవుతున్నదా? నువ్వు చేసిన పాపానికి అది ఫలితం అనుభవిస్తున్నది. అనుభవిస్తున్న సంగతి కూడా దానికి తెలియదు.

"దాని యౌవనాన్ని అపహరించినవాడివి, సంసారం చెయ్యడంలో నిజమైన సుఖం ఉందని దాని కెందుకు తెలియనివ్వలేదూ? కామం అసహ్యకరమైనది కాదనీ, మోక్షాని కది మొదటి మెట్టనీ ఎందుకు చూపలేక పోయినావు ?

"నువ్వేమీ పశ్చాత్తాపపడి రాలేదు. నీ కిక ప్రపంచంలో ఇంకేమీ లేదు స్వాంతం చేసుకోవటానికి — నా చెల్లెలు తప్ప. ఆ హక్కు ఒకటి దుర్వినియోగపరచటానికి వచ్చి, ఎత్తు పారదని తెలియగానే చల్లగా జారుకుంటున్నావు.

"నీకు నిజంగా బుద్ధి వచ్చినట్టయితే దాన్ని వదలి పెట్టకు. వెనక నిర్వర్తించటానికి అశ్రద్ధచేసిన బాధ్యతను ఇప్పుడు నిర్వర్తించు. మగవాడిలోనూ సంసారసుఖంలోను దానికి విశ్వాసం పుట్టించు. అందుకుగాను ఏ త్యాగమైనా చెయ్యి. దాని కాళ్ల ముందర ప్రాణాలు విడువు అవసరమైతే. ఒకసారి దానిహృదయం మారితే దానివల్ల నువ్వు కాకపోతేమరొకరైనా బాగుపడతారు. తెలిసిందా? అదయినా బాగుపడుతుంది. అటువంటి త్యాగం ఇతరులను చెయ్యమంటే చెయ్యరు. వారి కేం పట్టింది? అది ఇట్లా కావటానికి వాళ్లు బాధ్యులు కారు. నువ్వే బాధ్యుడివి. నువ్వే ద్రోహివి!" అన్నది.

వెంకట్రావు భయపడ్డ వాడల్లే వెనక్కు వెనక్కు పోతూ "నాకేమీ తెలియదు. నే నేమీ చెయ్యలేను. అన్నీ విసర్జించాను. నాకేమిటి?" అంటూ వాకిలి సమీపించి బయటికి జారుకున్నాడు.

శ్యామల నిట్టూర్పు విడిచింది. ఆమె అట్లాగే కొంతసేపు నిలబడి ఇంకొక నిట్టూర్పు విడిచి లోపలికి వెళ్లింది.

సుందరి తన మంచం పక్కన చతికిలబడి మొహం దిండుకుపెట్టి వెక్కి వెక్కి ఏడుస్తున్నది. శ్యామల ఆమెను చూడగానే ఆదుర్దాగా దగ్గిరికి వెళ్లి చెల్లెల్ని పొదువుకుని, "ఎందుకే, అమ్మా? పోతే పోయినాడులే, దిగులు పడకమ్మా, ఏడవకు!" అని సముదాయించింది.

"అది కాదు. నీ సంగతులు కొన్నికొన్ని నే నదివరకే విని, నువు సిగ్గుమాలిన దానివనీ, నువ్వుచేసిన పనే నేను ఎప్పుడైనా చేసినా నాకు అసహ్యం కనక నేను నీకంటె మంచిదాన్ననీ అనుకునేదాన్ని!" అన్నది సుందరి దుఃఖం ఉపశమించుకోలేకుండా.

సుందరి తను వెంకట్రావుతో అన్నమాటలు విన్నదని శ్యామలకు తెలిసింది చెల్లెలికి ఏం సమాధానం చెప్పాలో ఆమెకు తెలియలేదు. కాని ఆమె హృదయం ఆ చెల్లెలి కోసం యథాప్రకారం పొంగి పొర్లసాగింది.

# పసుల కాపరి

శ్రీ గొనుగుంట పున్నయ్య

మూరెఁడు గోచిపాత మొలపట్టెతో, నవనీల పేశల
శ్రీరమణీయమై చవులు జిమ్మెడు కాయముతోఁ బ్రఫుల్ల పం
కేరుహ వక్త్రసీమఁ దులకించు నమాయికమైన నవ్వుతోఁ
బోరఁడ! మూలఁ గాయుటకుఁ బోయెదవే, పొలిమేర కావలన్!

ముదిరిన దున్నకుఱ్ఱ నడిమూఁపున ఠీవిగఁ గూరుచుండి సం
పద గల రాచబిడ్డని క్రమంబునఁ గయ్యాలకేఁగు నీకు నే
కొదువయు లేదు సుమ్మి! మునికోటికి నైనను దైవ "చింత" త
ప్పదు; పరికింప నీ కదియుఁ బట్టదు! ధన్యుఁడ వోయి తమ్ముఁడా!

గుబురు మామిడి నీడలోఁ గొంతసేపు
తాపము శమింప నిలువఁగాఁ దలఁచినంతఁ
జెప్పినట్టుల యచ్చటే చేరి నిలుచు
పశువులకు నీకుఁ గలదేమొ భాష యొకటి!

తొలకరి వానకుం బెరిఁగి తోరముగా నును లేఁతపచ్చికల్
కలకల లాడు బీళ్లయెడఁ గమ్మఁగ మేయుచు నేదొ లీల లా
వలఁ జన నేరవింకఁ బసుపాలక, నెయ్యపు తోడఁ బంట కా
ల్వలఁ బడి యీఁదులాడెదవె పట్టఁగరాని కుతూహలంబునన్

కాల్వ నట్టట మునిఁగి పంకంబు దీసి
బోడి బుఱ్ఱకుఁ బల్మారు పూసికొనెదు!
కుఱ్ఱఁడా, దాని గుణమెట్లు గుఱుతునీకు?
ప్రకృతి శాస్త్రాలకీవె కారకుఁడ వేమి?

పళ పళఁ గాయు నెండ; తడివాయఁగ దేహము గామకొమ్ము బి
ట్టులసిరి వీఁది యీఁది, జలజాప్తుఁడు ప్రమొగ్గెను వారుణాశ; కాఁ
కలి సెలరేఁగెనేమొ జలకంబు శ్రమంబున, నాల్గుపాల కం
డెలుగొని త్రెంపెవెట్టి తిన నేరవ నీ వారయూస లేనివో?

కాపు దొరసాని తప్పని కార్యమగుట
ముంతలో జొన్నయన్నంబుఁ బోసి యిచ్చె
అలసటలు వాయ నద్దాని నానుమన్న
యమృత మది నీకు జఠర మాంద్యంబు లేమి !

ప్రకృతి ప్రియుంబుతో నిడిన పచ్చిక విందుల నాహరించి త
న్నికటపు టేటి కాలువల నీరములాని పశువ్రజంబు ల
ర్భక, కనుగొంటివే నెమరు వైచుచు నెట్లరగంటి నిద్దురన్
సకలము విస్మరించి నటు చల్లని నీడల విశ్రమించెనో !

పల్లవించిన మాకంద పాదపంపుఁ
జలువ నీడల శయనించి సఖుల తోడ
వెల్లి విరిసిన యానంద వీచి నింక
సొంత గీతాల నార్ద్రీకరింతు వేము !

చీఁకును జింత నేరనిది చిత్తము నీయది; మావి కొమ్మపైఁ
గోకిల కన్నె గర్వమునఁ గూయుచు నున్నది "సాటి గాయకుల్
నాకెవ" రంచు; మిన్నక చనన్ నగుబాటగుఁ బంతగించి "కూ
కూకుహూ" టంచు నీ వెదురు గూయుమ సామ్యకలస్వనంబునన్ !

అని వార్యంబగు నీ "హుషారు" నకు సాధ్యంబే జరాభార న
మ్రుని యట్లారక ప్రొద్దుపుచ్చుట లవంబున్ ? గోఁతి కొమ్మచ్చు లా
ప్పన బట్టిల్ బలిచెడ్గుడుల్ మొదలుగా బాల్యోచిత క్రీడలం
దున స్వేచ్ఛా జనిత ప్రతాప గరిమన్ జూపింపు నా బోంట్లకున్ !

పరిహాసంబని మిట్టిమూడ వల దబ్బా ! పెద్ద బస్తీల త
క్కరి నెయ్యంబుల మోదు వారినది నిక్కంబంత రంగంబు; నీ
సరసం జేరినఁ బల్లవించునను నాసల్ గల్గె; సావాసపుం
గరిమన్ నన్గొని పొమ్ము వెంట పసులన్ గాయన్ మనం బయ్యెడిన్ !

# వరూధిని

శ్రీ నరహరి నరసింహారావు

## I

"టక్కునేర్పడి కవుల గంటాల వ్రాఁత
కాదనఁగ రాదు ప్రాచీన కవులు గాన."

అవి హిమాలయ పర్వతములు. వాటిమీద సెలయేళ్లు భీషణ గర్జారావములతో ప్రవహిస్తూన్నవి. చుట్టుపట్ల రకరకాల చెట్లున్నాయి. వాటిమీద పక్షులు కిలకిలారావములు చేస్తున్నాయి. వివిధకుసుమ సౌరభసమన్వితమైన మలయ మారుతము మందంగా వీస్తోంది. దాపున ఉన్న ఒక జాజి పందిరి క్రింద వరూధిని మధురంగా గానం చేస్తూ, ప్రకృతి రామణీయక నికేతనాల్లో, శ్రుతిలగించి మహానందంతో లీలామానుషం అనుభవిస్తూంది. కొంతసేపటికి మనుష్యుల అలజడి విని, గానము ఆపివేసి, దారితప్పి అడ్డాడుతున్న ప్రవరుణ్ణి చూచి, పోకనును బోదియచేరి, విలోక నార్చుల చూస్తూంటూంది.

(గంపెడాసతో ప్రవరుడు మోమెత్తి మరల మోము వంచి దీర్ఘనిశ్వాసపూరితంగా)

ప్ర:—తల్లీ!

[ప్రవరుడు వరూధినియొక్క సౌందర్యానికి లోలోపల మురిసి పోతాడు. అంతరాత్మమాత్రం చలించదు. పట్టి అమాయకుడుగా ఏమీ యెరుగని నంగనాచి మాదిరిగా నటిస్తూ]

నాది ఆర్యావర్తము; నన్ను ప్రవరు డంటారు. దారితప్పి యిలా తిరుగుతున్నాను. పితృపూజకు దేవతార్చనకు భుక్తికి వేళ మించి పోవుచున్నది. దారి తెలిస్తే దారిచెప్పి పెద్దలుపొమ్మ్యే పుణ్యానపో.

వ:—నీ సందేహాలు చూస్తే నాకు చాలా హాస్యాస్పదంగా ఉన్నాయి.

[వరూధిని ముఖము ఒక్కసారి వికసిస్తుంది; లోలోన చిరునవ్వు నవ్వుతుంది]

ప్ర:—అనవసర ప్రస్తావనతో కాలం వృథాపుచ్చకు. నీకు దారి తెలిసిన చెప్పు. లేకపోతే నాదారిన నేను పోతా.

వ:—అంతకోపం దేనికయ్యా, భూసురా? వచ్చిన వారికి దారి తెలియకపోవునా?

ప్ర:—దేనికా! నే అడిగేదొకటి, నీవు చెప్పే దొకటి—చూస్తే వ్యవహారము శృతిమించి రాగాన పడేటట్టుగా ఉంది.

వ:—మీరు మరొక విధంగా అనుకోవద్దు సుమా! నేడు నాకు చాలా సుదినం. నే నెంతో పుణ్యం చేసికొన్నాను. నీవు నా కతిథివి. అతిథి సత్కారం చేసికాని, నేను వెళ్లనివ్వను. అది స్వర్లోక మర్యాద.

[ అని ఒక చిరునవ్వు నవ్వింది. నవ్వేటప్పటికి బుగ్గలన్నీ లేత గులాబీ మాదిరిగా ఎఱ్ఱబడ్డాయి.] లోనికి వెళదాం రండి (అని, చేయి అందిస్తుంది.)

ప్ర:—హరి, హరీ! ఎంతపాపం! ధర్మాలకు చాలా వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నదే.

వ:—హరి ఎవ్వరు? పాపమేమిటి? పుణ్యమేమిటి? ధర్మమేమిటి? అధర్మమేమిటి? ఇది మా స్వర్లోకమర్యాద.

[అని దబదబ ప్రశ్నించింది జవాబుకోసం నిరీక్షిస్తూ, తీక్షణంగా ప్రవరుణ్ణి చూస్తూ నిలబడ్డది.]

ప్ర:—హరి అంటే దేవుడు, సర్వాంతర్యామి ఆర్తత్రాణపరాయణుడు. ఈ మానవప్రపంచములో జరిగే అత్యాచారాలను, అన్యాయాలను ఖండించి సరియైన మార్గములో పెట్టే మహానుభావుడు. జగద్రక్షకుడు; పరోపకార పారీణుడు; దుష్టశిక్షక, శిష్టరక్షకుడు.

ఇక పాపపుణ్యాలన్నీ మనం చేసే పనులలో యిమిడిఉంటాయి. ధర్మకార్యాలు చేస్తేను, మానవాభ్యుదయానికి పాటుపడితేను, పుణ్యం వస్తుంది. అప్పుడు స్వర్గసుఖ మనుభవించవచ్చు. వీటికి విరుద్ధంగా చేసే కార్యాలన్నిటికి పాపం లభిస్తుంది. అంటే నరకమన్నమాట.

వ:—ఇదంతా వట్టి కల్ల, బూటకము. దేవుడంటూ ఒకడు లేకపోయినా, లేనిపోని దేవుణ్ణి కల్పించి తెచ్చిపెట్టుకున్నాము. అదంతా ఒక విధ

మైన భ్రాంతి. 'ఇందుగల డందులేడని సందేహము వలదని' పద్యాలు చదువుతారు. ఎక్కడున్నాడు? ఎప్పటినున్నాడు? ఆకారం లేదా? నిరాకార మైతే చూచేట్లా? అసలు నరకమేమిటి? స్వర్గమేమిటి? ఉంటేకాదూ? అన్నీ ఒకటే; అదంతా మన సృష్టించినస్వర్గము. పుణ్యం చేసి స్వర్గసుఖ మనుభవిస్తానంటావు. పుణ్యం చేయకయే ప్రాప్తమైతే?

[ఈ జవాబు వినేటప్పటికి ప్రవరుడు దిగ్భ్రమ చెందుతాడు. తల్లడిల్లుతాడు. ఇంకా విందామనే కుతూహలత ఎక్కువౌతుంది.]

ప్ర:—అయితే, మన మతసంప్రదాయాలకు వ్యతిరేకంగా పోతే, తప్పుకాదా?

వ:—అబ్బబ్బ! ఎందాక చెప్పనూ! మతమనే పేరిట ఎన్ని ఘోర కృత్యాలు జరుగుతున్నాయో చూడటం లేదా? మానవుడే ఒక మిషను కల్పించి, అనేక మతాలు పుట్టించారు. వాటిని చేకోడు వాకోడుగా చేసికొని వివిధ విధములైన సమాజాలు, సమితులు, బృందాలు, ఒకటేమిటి? ఎన్నెన్నో స్థాపించి, ప్రపంచాన్ని అల్లకల్లోలము చేస్తున్నారు.

అదివిని, ఛాందసుడు, పూర్వాచారములయందు గట్టినమ్మకం గల ప్రవరుడికి, మనస్సు చంచలిస్తుంది. వరూధిని చెప్పిన మాటలన్నీ ఒక్కసారి మనసార తలపోస్తూ, పరిపరివిధాల ఆలోచిస్తాడు. కొన్ని కొన్ని సందేహాలు మాత్రం ఊగులాడుతూ ఉంటాయి. కాని, చివరికి నిజమేగదా అని స్థిరపరచుకుంటాడు. అప్పటికి రెండు జాములవుతుంది. క్షుద్బాధ ఎక్కువౌతుంది. దాహం కావాలన్నాడు.

వరూధిని లోలోన 'దారిలోకొచ్చాడుగదా' అని నవ్వుకుంటుంది. ఉబలాట పడుతుంది. మితిమీరిన సంతోషముతో వెంటనే ప్రవరుణ్ణి ఒక పొదరింటికి తీసుకు వెళ్లుతుంది. కని విని యెరుగని రకరకాల ఫలములు, నిర్మలమైన నీరు తీసికొచ్చిస్తుంది ప్రవరుడు అదురు బెదురు లేక ఆరగిస్తాడు. నిద్ర వోస్తుంది. అచ్చటనే హాయిగా శయనిస్తాడు.

II

ఆనాడు పూర్ణిమ. సాయంకాలం 7 గంటలవుతుంది. పిండారబోసినట్లు పండువెన్నెల తెల్లగా ఉన్న మల్లెపూల మాదిరిగా ప్రకాశిస్తున్నది. ప్రవ

రుడు ఆవలిస్తూ నిద్రనుండి లేస్తాడు. తత్తరపాటు చెందుతాడు, సంధ్య వార్చే వేళ పోయిందే అని. కాని ప్రకృతిశోభా, పరిమళత వాని మనస్సు శాంతి చేస్తవి. దాపున ఉన్న వరూధినితో—

'దారిచెప్పు, నే వెళ్ళుతాను.' ఇంటిదగ్గిర నా భార్య జననీ జనకులు ఎంత తబ్బిబ్బులాడి పోతున్నారో! హృదయ దారకంగా ఉంది.

వ:—అబ్బా! ఈ రాత్రి ఇచ్చటఉండి తెల్లవారుజామున లేచి వెళ్లుదురు గాని; ఒక రోజులో మీరు చేసే ఘన కార్యాలన్నీ మించిపోవులే; మీ సుకుమార శరీరానికి పథశ్రమ తగ్గనీయండి.

ప్ర:—నేను నిత్యవ్రతుడను. నాకు ఈ నాడు దీక్ష లేకపోతే హృదయం చలిస్తుంది.

వ:—సుఖ్యా నంతాలకిచ్చిలో పడుతున్నావు; అదిసరేగాని, ఆ చెట్టుపైన ఆ పక్షిదంపతులు ఏం చేస్తున్నాయో చెప్పు.

ప్ర:—ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాయి.

వ:—అంతే?

ప్ర:—వాటిప్రేమను వెలిబుచ్చుకుంటున్నాయి. దానిని స్వేచ్ఛా ప్రేమం టారు. అది నిర్మలమైన సహజమైన ప్రేమ. అదిప్రకృతి స్వరం ము.

వ:—అలాంటి ప్రేమతో నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నా సౌందర్యంతో నిన్ను కట్టివేయ దలచుకున్నా.

ప్ర:—ఇలామాట్లాడుట చాలా తప్పుగాదా? ప్రేమనే దానికి హద్దుపద్దులు లేవా? అసలు ప్రేమంటే తెలిసికోవద్దా? దైవస్వరూపమే ప్రేమ. మన హృదయాన్ని వాని పాదాల సంధించినప్పుడే అది భవ్యము.

వ:—యజ్ఞ యాగాదులు చేశానంటావు; తపస్సు చేశానంటావు. ఏమి చేసిననేమి! భూతదయ లేనిపక్షమున నవియన్నియు నిష్ఫలమే. అదీ గాక, అసలు ప్రేమవాహినికి అంతులేదు. అలాంటి సహజ మైన ప్రేమతత్వములో జలకమాడే నాహృదయము నిన్ను కోరు తుంది. ప్రేమ ఒక అంధకారజ్యోతి. దానికి తప్పొప్పులు తెలియవు. పూర్వకాలంలో ఇంద్రుడు అహల్యను, విశ్వామిత్రుడు మేనకను

పరిగ్రహించారు. ఇలాంటి మహాపురుషులకు తప్పులేందే నీకు తప్పొచ్చిందా?

ప్ర:—నీవు చెప్పేమాటలు నా కర్థం కావటంలేదు.

వ:—ఇంకా ఎందాకా చెప్పేది? ఎన్ని దృష్టాంతరాలు చూపించినా నమ్మవాయె; నా హృదయములో ఉన్న ప్రేమతత్వము నన్ను దహించి వేస్తుంది. అదీ గాక "ఆనంగో బ్రహ్మయటన్న ప్రాజ్ఞుపునంతగుబ్బద్ధి నూహింపవే"

ప్ర:—నీకు నిజమైన ప్రేమ ఉన్నదని నేను ఎలా తెలిసికోగలను? అసలు ప్రేమనేది లేదు.

వ:—నా ప్రేమ ఔన్నత్యము తెలిసికోవాలంటే నా పవిత్రమైన హృదయాన్ని తరచి, అడుగు...[అంటూ ప్రవరుని చేయి తీసికొని హృదయ పేటికపై హత్తుకొంటుంది.]

ప్రవరునికి ఒక విధమైన చైతన్యం కల్గుతుంది. గగుర్పాటు చెందుతాడు. నిశ్చితంగా ప్రేమిస్తుం దనుకుంటాడు. వెంటనే ఒక ప్రేమపుష్పం సమర్పిస్తాడు. ఇద్దరు ఒకరి కౌగిళ్ళలో ఒకరు చిక్కుకుపొయ్యారు. గగనవీధుల్లో సంచరిస్తూన్న సంపూర్ణ చంద్రుడు, ఇది చూచేటప్పటికి, సహించలేక కామోసు, తన్మయత్వము చెంది, వెంటనే తారకోసం పరుగిడుతూ, వరూధినీ ప్రవరుల అకాలగాఢ తిమిరములో ముంచివేస్తాడు. నిమీలిత నయనాల్తో వారు అలాగే చూస్తూంటే, ఆ పక్షిద్వయం కిలకిలా రావాలు చేస్తూ, జంటవీడి, కెవ్వున లేచిపోయాయి.

# విలయగీతి

శ్రీ వంకాయలపాటి శేషావతారము

విప్లవధుమారాలు
వినువీధి కెగరంగ
రంగత్తరంగాలు
పొంగి పరువెత్తంగ
చావుబ్రతుకులు రెండు
సయ్యాటలాడంగ
హాహారవాలతో
ఆకాశమదరంగ
సర్వనాశన కేళి
సాక్షాత్కరించంగ
వినిపించెదవ టోయి
విలయగీతము కవీ !

మాతృవక్షోవిని
గ్గత సుధాధారలో
భయదహాలాహల
ప్రకృతి చిందాడంగ
నేత్రోనిర్ఝరులలో
నిర్మలాంబువులింకి
కనదుష్టరక్తముల్
కాల్వలై పారంగ
పండు రేయెండలో
భగభగలు సూపంగ
వినిపించెదవ టోయి
విలయగీతము కవీ!

అంబుదాల్ భగ్గుమని
అగ్నివర్షించంగ
గుట్టమెట్టలుబూది
గుట్టలై వెలయంగ
బ్రహ్మాండభాండంబు
బద్దలై దొర్లంగ
చిట్టినక్షత్రాలు
చిదురుపలై రాలంగ
పాపాలుపుణ్యాలు
రూపారిపోవంగ
వినిపించెదవ టోయి
విలయ గీతము కవీ!

ఆనంక పిరికి కం
డల తూరుపెత్తంగ
తారాకుసగాత్రాలు
తల్లక్రిందులు కాగ
గ్రహష్ఠిగోకాన, గ
గ్గోలు కేకెత్తంగ
ఆ భీలవిలయ గ
ర్జారావ మీ వంక
మహదంతరిక్షాన
మార్మ్రోత వెట్టంగ
వినిపించెదవ టోయి
విలయగీతము కవీ !

# వీరదంపతులు

శ్రీ యార్లగడ్డ శ్రీకృష్ణ చౌదరి

## III

మునీంద్రుడా పర్ణకుటీరమున యుక్తి ప్రయుక్తులతో యువకోపచారము చేయుచున్నాడు. హిత సాధక చక్రవర్తి యనదగు నా యోగీంద్రుని సంకల్పసిద్ధి వలనను, పరమేశ్వరుని యపార దయా మహిమ వలనను నా యువక శరీర మిటునటు కదల నారంభించినది. ఆతని స్ఫురద్రూపము, వ్యాయామ కర్కశమగు బలిష్ఠ శరీరము, విశాల వక్షస్థలము, ఆజానుబాహువులు, అత్యాయతమైన నెన్నుదురుకురులు, అష్టమీచంద్ర శకలాకారములైన కనుబొమలు, అవయవ సౌష్టవము నా ఋషిసత్తముని దృష్టి నాకర్షించినవి. ఈతడు బ్రహ్మచర్య పాలనము వలననే బ్రహ్మతేజమును బయటికి చిమ్ముచున్నాడని తలంచెను. తన చిరకాల సంకల్ప మీతని వలననే నెరవేరగలదని యూహించినాడు. స్వదేశ సేవా సౌభాగ్యమున నీ యువకాగ్రణి పాల్గొనినచో, తన మనఃకమలమున మణగియున్న యిచ్ఛామధుకరములు ప్రేమగీతాలు పాడి మానవలోకమున ధన్యత గాంచగలవని మనఃఫలకమున జిత్రించుకొన్నాడు.

ఇంతలో యువకుడు చైతన్యావస్థకు వచ్చి, విజయా! విజయా! ప్రేమస్వరూపిణీ! విజయా! మాతృదేవీదాస్యవిమోచనలో నాతోపాటు నీకు భాగమున్నదంటివి. కడకు నన్ను, ప్రియ మాతృదేశమును త్యాగము జేసి పోయితివి. నీ ప్రక్కనుండి దేశసేవ చేయుగలనను అభిలాషను భగ్నపరచితివి. నీ ప్రేమ హృదయములో నాకు స్థానము లేదు.

విజయా! మందభాగ్యుడను నేనని పలవరించినాడు. యోగీంద్రుడు, తన చిరాభిలాషా ప్రభాతోదయము ప్రారంభమైనదని సంతోషించినాడు. దేశభక్తుడగు నిట్టి యువకరత్నమును తన కొసంగిన దేవదేవునకు చేతులు జోడించి నమస్కరించినాడు. తరువాత నెమ్మదిగా కొన్ని గంటలకు యువకునకు సంపూర్ణ చైతన్యము కలిగినది. కనులు విప్పి నలువైపుల తేరి

పారజూచి ప్రక్క నున్న యోగీంద్రునివైపు దృష్టి ప్రసరింప జేసి నమస్కరించినాడు. అపరిచితమైన యాప్రదేశముజూచి విస్మయము జెందినాడు.

మునీంద్రా!

ఈ కుటీర మెవ్వరిది. నాకు ప్రాణదాన మొసంగిన దయామయు లెవ్వరు? ఇప్పుడు నేనెచ్చటనుంటిని. అని నెమ్మదిగ ప్రశ్నించినాడు. అమందానందము జెందమున గ్రందుకొన నా యోగీంద్రు డన్నాడు. నాయనా! మృతకల్పమైన నీశరీరము నదీప్రవాహమున గొట్టుకొని పోవుటజూచి బయటకుదీసినాను. పరమేశ్వరుని యపారకృపా కటాక్షమున పునర్జన్మ పొందినావు.—ఈ మాటలువిన్నమీదట యువకున కాసమయమున ప్రభాతమున నదీ గర్భమున జరిగిన విషాద సంఘటన జ్ఞప్తికివచ్చినది.

సాధు దేవా! నావంటి యభాగ్యశరీరము మరియొకటానదిలో మీకు గనుపడ లేదా?. యని ప్రశ్నించినాడు.

విజయ వృత్తాంతము బహిర్గత పరచిన యువకునికి ఆత్మశాంతి యుండదని తలచినాడా యోగీంద్రుడు.

కుమారా! నీవు చిక్కిన ప్రదేశమున నా కెట్టిమానవ శరీరమును గనుపడ లేదు. కేవలము నీవుమాత్రమే నాకు దొరకితివి. ధీరహృదయుడవు గమ్ము! మనస్సున విచారమునకు తావివ్వకుము! నీ నిజవృత్తాంత మెరిగింపుము! ఏకారణముచేత జలగర్భమున మునిగిపోతివి! ఆ నంద కుమారుని హృదయ సాగరమున భయంకరమైన తుపాను వీవసాగినది. మనస్సును బిగియబట్టలేక పోయినాడు. కనులవెంట నశ్రుజలము జలజల రాలుచున్నది. డగ్గుత్తికతో మాటాడలేక మాటాడలేక యిట్లు ప్రారంభించినాడు.

మునీంద్రా! అభాగ్యుడనైన నా కథచాల పెద్దది. పరమపూజ్యులైన మీకు చెప్పక తప్పదు. దానిని క్లుప్తపరచి చెప్పెదను. అతులదయాస్వరూపుడైన మాతండ్రి "మిలన్" నగరములో నొక సంపన్న కుటుంబమునకు జెందినవాడు. విద్యాబుద్ధులయందు సైతము గణనకెక్కినవాడు. కాని మా పితృపాదులకు దుఃఖము తప్పలేదు. నా చిన్నతనమునందే

నా ప్రియజనని స్వర్గస్థయైనది, తల్లిలేనిబిడ్డనగు నా లాలన పాలనయందు మాత్రము నిమగ్నుడై యే లోటురానీయక యాయన సర్వప్రాణములు నాయందేయుంచి బిడ్డా! తల్లి లేనివాడవైతివి, అని నన్ను నిమురుచు కనులవెంట ఏకధారగా నీరుగార్చుచుండెడివాడు. నన్నాయన యొడి యందే బెట్టుకొని పెంచినాడు. ఇందేమాత్ర మతిశయోక్తి లేదు. నా తండ్రియంకమే నా బాల్యక్రీడాస్థలముగా నుండెడిది. ఆ నాటి దృశ్య ములు జ్ఞప్తికి వచ్చునపుడెల్ల నా కనులశ్రుజల పూరితము లగును. నా పితృదేవునకు నే నెంతయో ఋణపడి యున్నాను. ఆయన సేవా శుశ్రూషలకు గూడ దూరమై పోతినే యని దుఃఖించు చుంటిని. కన్నీటిజాలు చేతనే పితృదేవుని ప్రేమకు వారు పోసితిని. ఆ నాడు నా తండ్రికి నా సంబంధమైన దుఃఖమేగాక మరియొకటి గూడ సంప్రాప్త మైనది. పరోపకార పరాయణుడైన నాతండ్రికి, దేశములో గలిగిన యశాంతిప్రజల దుఃఖారవములు, కష్టభూయిష్టములైన రాజశాసనములు, రాజభటుల యత్యాచారములు, మరింత హృదయ విదారకము లైనవి. ఒక్కపూట గూడ కడుపునిండ తిండిలేని, దీనులైన ప్రజల యార్తనాదము లను వినలేక పోయినాడు. నిర్దయుడైన యారాజు యొక్క నిరంకుశత్వము నకు విచారపడినాడు. ప్రజలకు తన శక్తికొలది సహాయము జేయుటయే గాక వారి రక్షణ మార్గము నన్వేషణచేయ ప్రారంభించినాడు. ఈవిషయ మంతయు రాజ కర్మకారిగణము గ్రహించి నా తండ్రిగారిమీద, న్యాయ స్థానమున కేసు బెట్టినది. లేనిపోయిన వన్ని నా తండ్రిగారి మీద పులిమి నారు. అటుమీద నా జనకుడు నిర్దోషి యని చాల మంది సాక్ష్యమిచ్చి నారు. కాని న్యాయాధికారి రాజభటుల సాక్ష్యమునే ప్రమాణముగా దీసి కొని, న్యాయ మను పేరుతో నా తండ్రికి ఘోరాన్యాయము జేసినాడు.

దారుణమైన జరిమానా విధించినాడు. అది చెల్లించకపోయినచో నాజనకుని యాస్తిని ప్రభుత్వము స్వాధీన పరచుకొనునట్లు తీర్పు జెప్పినాడు. దానిపై నా తండ్రి యున్నత న్యాయస్థానములకు వరుసగా నొక్కొక్క దానికి వినతి పత్రములు బంపుకొన్నాడు. ఘోరాన్యాయ మని స్వయముగా జెప్పు కొన్నాడు. అవి యన్నియు క్రింది న్యాయస్థానపు తీర్పే ఖాయపరచినవి. అంతటితో బోక క్రొత్త క్రొత్త యుత్పాతములు వారి యందు మోప

ప్రారంభించినారు. అన్యాయమున కాలవాలమైన రాజకర్మకారి గణమందు న్యాయమునకు స్థానమెక్కడ ? అని నా తండ్రి నిస్పృహ జెందినాడు. ఆ నాటినుండి యాయన హృదయమునకు శాంతి లేదు. ఒకనాడు సుదృఢమనస్కుడై నన్నెత్తుకొని గృహోపరిభాగ మునంతయు వీక్షించి కనుల వెంట నశ్రుజలములు రాల్చుచు, మా పురమున కనతి దూరములో నున్న వన ప్రాంతమున బడిపోయి యందున్న యొక యోగీంద్రుని కుటీరము వద్దకు చేరి, యట నన్ను దింపి చిరపరిచితుడైన యా మహానుభావునకు వినమ్రుడై నమస్కారము జేసి.

యోగిపుంగవా !

న్యాయమునకు ధర్మమునకు దేశములో స్థానము లేకుండ బోయినది. ప్రజల యార్తనాదములు వినలేకపోయినాను. వారిపైని ప్రతిదినము ప్రయోగించు క్రూరశాసనములకు నత్యాచారములకు హద్దుపద్దులు లేవు. ప్రభుత్వ పరిపాలనయందు ప్రజల కసహ్యత కలిగినది. ప్రజలయందు ప్రభుత్వమున కింతటి విరోధము గలుగుట ప్రజలక్షేమమునకే యని తలంచుచున్నాను. ఎప్పటికి వారిహృదయములలో దాగియున్న యగ్నికణాలు మండకపోవు. ఆనాడు దేశమంతయు విప్లవముగాక తప్పదు. మానవ కళ్యాణముకొఱకు దేశ సౌభాగ్యముకొఱకు నా గృహధనాదిసర్వసంపత్తులు త్యాగము జేసినాను. నా యేకైకపుత్రుడగు యీ బిడ్డను నా ప్రియమాతృ దేశముకొఱకు దానము చేయుచున్నాను.

గురుదేవా !

ఈ నా ముద్దుబిడ్డ నీనాటినుండి మీ బిడ్డనుగా జూడుడు. మాతృదేశ సేవా పరాయణుడగునట్లు సుశిక్షితుని జేసి విద్యగరపుడు. దేశోద్ధరణ కవసరమైనచో ప్రాణములనుగూడ తృణప్రాయములనుగా దలచి యిచ్చునంతటి యోధవరునిగా తయారుజేయుడు. పరాధీనమాతృదేశమును మరువవద్దని హెచ్చరించుడు. నీమాతృదేశము స్వాతంత్ర్యము బొందనంతవరకు నీతండ్రి యాత్మకు శాంతిలేదని చెప్పుడు. గురుదేవా ! సెలవు పోవుచున్నానని నన్నచ్చట వదలి నా పితృదేవు డెక్కడికో పోయినాడు. నాకదియే యాయన తుదిసందర్శనము. తరువాత నే నా కుటీరమందే నివసించుచుంటిని. నాకంటె

కొంచెము తక్కువవయస్సుగల కుమార్తె సాధు దేవున కుండెను. ఆమెకును నాకును విద్యాభ్యాసము జేయ మొదలుబెట్టినాడు. మేమిద్దరము నొకేచోట చదువుకొనుచు నొకేచోట నాడుకొనుచు నొకచోటనే పరుండెడివారము. కేవలము శరీరములు రెండుగాని మనస్సొక్కటిగానే యుండెడిది. ఇట్లు కొన్ని వత్సరములు జరిగినమీదట యోగీంద్రుని కవసానకాలము సంప్రాప్తమైనది. మమ్ములను బిలచి నా తండ్రిగారి సందేశము వినుపించినాడు. మా యిద్దరికి దేశభక్తిపూరితమును మంగళప్రదమునైన యుపదేశము జేసినాడు. మా చేతులు బట్టుకొని యొకరిచేతిలో నొకరిచేయి వేయించి, కుమారా! యీ నా ముద్దుబిడ్డను నీ కొసంగుచున్నాను మీ పాణిగ్రహణము మంగళకరుడగు భగవానుని సాక్షిగా జరిగినది. మీ రిరువురు సన్న్యాసానురాగముతో మాతృదేవికి ముద్దుబిడ్డలై మనగలరని యాశీర్వదించి పరమశాంత స్వభావుడైన యా యోగీంద్రుడు పరమపదించినాడు.

ప్రేమదంపతులమైన మేము నాతండ్రిగారి సందేశానుసారము దేశమునకు స్వాతంత్ర్యము రానంత వరకు నెట్టిసుఖమనుభవించగూడదని నిశ్చయించుకొని బ్రహ్మచర్య పాలనలో నున్నారము. దేశ సేవా దీక్షితులమైన మేము ప్రజామండలిలో ప్రచారము జేయుటకై శుభదినమున బయలుదేరి యీ నదీ గర్భమున మునిగిపోయినాము. నా ప్రేమ స్వరూపిణి విజయ పోయినది. ఆమెతో దేశసేవ చేయవలయు ననుసంకల్పమునకు విచ్ఛిత్తి కలిగినదని యువకుడు కన్నీటిజాలు ప్రవహింపజేసినాడు. ఏ కారణముచేతనో యోగి పొంగి పొరలివచ్చు దుఃఖము నాపుకొనినాడు. ఇద్దరి ముఖకమలములయందు సుఖచ్ఛాయలు ఆవరించి యున్నవి. రెండు నిమిషములు మౌనముద్ర వహించిరి. అప్పుడు యువకుడు యోగీంద్రుని వైపుజూచి,

యోగీంద్రా !

దేశసేవయందు జెట్టి కష్టములు సంప్రాప్తించును? వాని నెట్లెదుర్కొనవలయును? ఏవిధమున ప్రజలను ప్రబోధించవలెను? దండయాత్ర నెట్లు సాగింపవలెను? దయయుంచి చెప్పగోరెదను.

నాయనా! ఒకప్పుడు సర్వసౌఖ్యముల కాకరమై, అతిథి పూజల కాలవాలమై, ఆరోగ్యవంతులకు పుట్టినిల్లై, వీరాధివీరులగు యోధులకు, భక్తులకు, త్యాగులకు, భోగులకు, యోగులకు నావాసమైన స్వర్గభూమి; నేడు దుఃఖితులకు, వనారోగ్యవంతులకు, కంకాళస్వరూపులగు దరిద్రులకు, బిచ్చగాండ్రకు నివాసభూమి యైనది. మానవ సముదాయములో శాంతిలేదు. యనుబాధల ననుభవించు చున్నారు. ఎటుజూచినను ఆర్తనాదములే. అన్నములేదు, వస్త్రములేదు, ఇల్లులేదు, పరుండ చాపలేదు - ఒకరు గాదు, వందలుగాదు వేలుగాదు, లక్షలుగాదు, కోట్లకొలదిగా నున్నారు. ఎవరి ముఖము నందును ప్రసన్నభావము లేదు. కడుపుమంట చల్లారక చింతా నిమగ్నులై యున్నారు, దేశ మంతట దొంగతనములు కపట ప్రవృత్తులు చెలరేగినవి. వీని కన్నిటికి నొకటే కారణము. ఏయింటను పుష్కలముగా నన్నములేదు. దేశము దరిద్రావస్థలో నున్నది. ఈ కుతంత్రములతో, ఈ రాజశాసనములతో యీ దేశము సుభిక్షము కానేరదు. మానవ సముదాయములో మణిగియున్న స్వాతంత్ర్యజ్యోతిని ప్రజ్వలింప జేయుము. సంస్కారజ్యోతి ప్రతి మానవుని యందును నుండును. కాని కొందరి నజ్ఞానమను నంధకారగ మావరించి యుండును. లాంతరుగ్లాసు మసితో గూడినప్పుడు లోపలి దీప కాంతి యగపడనట్లే యజ్ఞానియొక్క సంస్కారము బయటికి స్ఫురించదు. కావున ఆ సంస్కారమును బయటికి దేవలెను. దీనివలన నీకు కొన్ని బాధలు రాక తప్పవు. వానిని లక్ష్యముచేయక కార్య భారమునందే నిచిత్తము నాయత్తము జేయుము. ఆత్మ బలముచేతనే నేనికార్యమును సాధించగల నని దృఢ మనస్కుడవు గమ్ము. మాతృదేశ స్వాతంత్ర్య వీర గీతాలు దేశము నలువైపుల మారుమ్రోగునట్లు ప్రచారక దళములో గానము గావింపుము. "మీ పరాధీనత పారదోలుడు. మాతృదేశస్వాతంత్ర్యము కొఱకిప్పుడో యొకప్పుడు రాలిపోయెడి యీ తుచ్ఛ శరీరములను లెక్కచేయక పోరాడుడు. మీ భావిసంతతి భాగ్యోన్నతికై పాటుబడుడు. ప్రజలదే ప్రభుత్వమనిపించుడు. ప్రజా ప్రభుత్వమునకు జై! యని నడుములు బిగియగట్టుడు. అప్పుడు గాని మీవాంఛితములన్నియు నెరవేరజాల" వని వారిని హెచ్చరిక జేయుము.

బిడ్డా! ఇక బొమ్ము. భగవానుడు తోడునీడయై నీ సంకల్పము నెరవేర్ప గలడు. నేడు నేను గూడ ఈ పర్ణకుటీరమును వదలివేయు చున్నాను. సరియగు సమయమున నే నేను నీతో గలసి కొనెదను. అని వీరోచితగంధాక్షతలు యువకుని లలాటమున నిడి శుభాశీస్సు లిచ్చినాడు. యువకుడు వినమ్రుడై నమస్కరించి యటనుండి బయలుదేరినాడు. ఎక్కడికి బోవు చున్నాడో యెవరికిని దెలియదు.

## IV

ఆనందకుమారుని హృదయ ప్రేమసామ్రాజ్య మహారాజ్ఞి యగు విజయ ప్రేమోపాసిని యగు విజయ కొన్నిమాసముల వఱకా భయంకరారణ్యము నందే పశుపక్షి సంతానమును ప్రేమించుచు వానితోనాటలాడు కొనుచు, తన ప్రేమనాథుని హృత్కమలమున నారాధనచేసికొనుచు గమ్యస్థాన మను నది లేక మానవజగత్తును మఱచి తిరుగుచునే యున్నది. ఇట్లు తిరుగుచు తిరుగుచు హఠాత్తుగా నొక పల్లె సమీపమునకు వచ్చినది. అది ప్రభాతము. చలిదినములు. అది మాఘమాసము. వస్త్రహీనులగు దరిద్రులు భయపడు రోజులు. విజయ చూపులు ప్రజల మీంద బడినవి. ప్రజలలో తేజస్సు లేదు. వారి ముఖములయందు ఉదాసీనత వ్యాపించి యున్నది. ఆమె యొక శిథిలావస్థలో నున్న పూరింటి సమీపము నకు వచ్చి యచట చలి బాధ కోర్వలేక మోకాళ్ల సందున తల పెట్టుకొని, వస్త్రము లేక, చినిగిపోయిన గోచిపాతను ధరించి వీపు సూర్యదేవుని వైపు బెట్టి వణకుచూ కూర్చొని యున్న యొక అస్థిచర్మమయ కంకాళ స్వరూపుడైన రైతును జూచినది. దిగ్భ్రమ జెందినది. ఆ యింటివైపు జూచినది. లోపలి భాగమున మలినాంబర ధారిణియై, యొంటినిండ వస్త్రము లేక కుమారుని వడియందు బెట్టుకొని వణకుచు, కూర్చునియున్న యా యిల్లాలిని విపరీతముగా జూచినది. చలిగాలి వీచుచున్నను లెక్కసేయక యట నిలబడినది. అన్నమునకు లోటైనను, మర్యాదకు లోటు రానివ్వని యా రైతు, దయాహృదయుడైన యా రైతు, వెంటనే లేచి భార్యను బిలచి, యామె కూర్చొనుటకు చలిగాగు ప్రదేశమున చాప వేయించి, తల్లీ దయచేయుము, కూర్చొనుము, అనినాడు. విజయ కూర్చొన్నది.

అమ్మా ! నీ వెవరవు ? ఎచ్చటనుండి వచ్చుచుంటివి ? అని యాదర పూర్వకముగా రైతు ప్రశ్నించినాడు.

బాబూ !

నా గమ్య స్థానము ఒక చోటని చెప్పజాలను. అభాగ్యురాలను. రోగిని. నా కథ తరువాత చెప్పెదను. మీ కిట్టి సిరుపేదరిక మనుభవించుటకు కారణమేమి ?

అమ్మా !

నే నొక సాధారణభూవసతి కలిగిన రైతు బిడ్డను. ఆ ఫలసాయము వలననే, నేను, నా భార్య, ఈ పిల్లలు జీవించుచున్నాము. ఇప్పటికి కొన్ని దినముల క్రిందట భూతదయాశాలి యైన గయొక మహనీయుని మీద రాజ భృత్యులు ఒక నేరమును సృజించి నన్నందబద్ధపుసాక్ష్యము నిమ్మని చెప్పినారు. నే నందులకియ్యకొనని కారణమున నా యందు మరియొక నేరమును మోపి నా సర్వస్వము లాగుకొనినారు. తల్లీ ! చూడుము. నాశూన్య గృహములో తినుటకు కన్నపు మెతుకైన లేదు. ఆ గడ్డిచాపయే పరుండుట కాధారము. మా జీవితము లుపవాసములతోనే గడచిపోవుచున్నవి. అని యా రైతు కనులవెంట నీరు బొట బొట గార్చ యావురుమని యేడ్చెను. విజయ హృదయము ద్రవీభూతమై పోయెను. బాబూ ! విచారింపకుమని యా రైతు కుటుంబమును వెంట నిడుకొని వారి నాదర్శముగా ప్రజలకు జూపు నుద్దేశ్యముతో నపర దుర్గావతారమా యనునట్లు చేత త్రిశూలము ధరించి ప్రతిపట్టణము, ప్రతిపల్లె నందు గొందులలో నున్న గృహములందు గూడ నిలబడి స్వాతంత్ర్య వీరగీతాలు పాడి ప్రజలను దేశభక్తిపూరితులను జేయ ప్రారంభించినది. కష్టజీవులగు కార్మిక, కర్షకులను జూచి వారిలో నణగియున్న స్వాతంత్ర్యజ్యోతిని ప్రజ్వలింప జేయవలె ననుకొన్నది. దేశము నలువైపుల గుమ్మరుచు ప్రతి దేశమున మహోపన్యాసముల నిచ్చి ప్రజలనందరిని యోధులనుగా తయారు జేసినది. వీర సైనిక దళమును సమకూర్చ ప్రారంభించినది. అదివరకు ప్రభుత్వమున కండగా నున్నవారు సహిత మామె మృదుమధురవాక్కులకు ద్రవీభూతులై పోయి వీరసైనికదళములోచేరుచున్నారు. మాతృదేశస్వాతంత్ర్యసమరమున ప్రాణ

ముల తృణప్రాయముగ నెంచి పోరాడుటకు సిద్ధముగ నున్నారు. అసంఖ్యా కులైన కర్షక, కార్మిక, ధని, నిర్ధన, స్త్రీ, పురుష బాలకులు సహితము వీరసైనికదళములో చేరినారు. ఈ సైన్యమునకు విజయ నాయకత్వము వహించి, కేల ఖడ్గమును ధరించి, "మిలన్" నగరమును ముట్టడించుటకు బయలుదేరదీసినది. జై! స్వతంత్రజన్మభూమికిజై! అని వీరసైన్యమంతయు నామె వెనుక బయలుదేరిపోవుచున్నది.

ఆనాడు యోగీంద్రునివలన శుభాశీస్సులు పొంది బయలుదేరిన యువక రత్నము ఈనాడు దేశములో స్వాతంత్ర్యాగ్నిని, రగుల్కొల్పినది. ఆయన యుపన్యాసములు వినుటకు ప్రజలు వందలుగాదు, వేలుగాదు, లక్షల కొలది గుమిగూడుచున్నారు. ఆ దేశభక్తుని యుపన్యాసములు విన వలెనని యెక్కడెక్కడినుండియో చద్దియన్నము మూటలు గట్టుకొని వచ్చు కార్మిక, కర్షక బృందముల కంతులేకపోయినది. ఒకనాటి బహి రంగసభకు లక్షలకొలది ప్రజలువచ్చి కూర్చొన్నారు. దేశభక్తుడైన యువకుడు సభామండపమునకు వచ్చి ప్రజాసమూహమును తేరి పార జూచి నమస్కరించి యిట్లు చెప్ప ప్రారంభించినాడు.

ప్రియ సోదర సోదరీమణులారా!

మీ సేవకుడనైన నేను మీకువందనము లర్పించుచున్నాను. ఇప్పుడుపన్యా సములకు సమయముగాదు. రణభేరి మ్రోగింపవలసిన తరుణము. ఒకటి రెండుమాటలు చెప్పి విరమించెదను. శృంఖలాబద్ధయైన మాతృదేవి నొక్కసారి స్మరింపుడు. పరాధీన మాతృదేశము నొక్కసారి మననము జేసికొనుడు. సస్యశ్యామలమైన మాతృదేశపు స్వాతంత్ర్య సమర ములో మీరందరు వీరసైనికులుగా పాల్గొనవలెను. మీ సర్వసంప దలు, ఆలుబిడ్డలు ఇల్లువాకిళ్ళు త్యజించి దేశముకొరకు బలియై పోవుటకు సిద్ధముగానుండవలెను. ఎప్పుడో నొకప్పుడు మరణము రా తప్పదు. మంచముమీదబడి దుర్గతిగా మరణించుటకంటె, దేశము కొఱకు, అన్నాతురులైన ప్రజలకొఱకు, మీకర్తవ్యము కొఱకు మరణించుట యశోదాయకము. ఇది మీ యిచ్ఛకు విరుద్ధముగా నిన్నయెడల యీ సమరములో పాల్గొనుమని మిమ్ముల బలవంతపెట్టను. ఈ పుణ్యభూమి

మాదేశము, మాహక్కు, మాజన్మభూమి, యని మీయందరికిజ్ఞాపక మున్నచో, జన్మభూమి స్వాతంత్ర్యమే మా పరమావధియని మీకు దృఢ విశ్వాసమున్నచో దేశముకొఱకు కోట్లకొలది అన్నము లేని బీదప్రజల కొఱకు ముందుకు రండు. అట్టి వారినే నేను కోరుచున్నాను. మీలో మీకు వ్యక్తిగత విరోధములున్నచో మరచిపొండు. మీరందరు స్వాతంత్ర్యపతాకము యొక్క నీడను నిలచి "జై మిలన్ సామ్రాజ్యలక్ష్మికీ జై" అని మిలన్ దేశమాతను స్వాతంత్ర్యసింహపీఠినెక్కించినపుడే మీ జీవితములు ధన్యత గాంచగలవు. సర్వత్యాగసంపన్నులను వీరాగ్రేసరులను దేశమాత యాహ్వానించు చున్నది. అట్టివారందరు నావైపునకు వచ్చినిలబడుడు. నేడే మిలన్ నగరదండయాత్ర ప్రారంభముగానున్న దని, తన యుపన్యాసము ముగించినాడు. ఆజనసమూహములోనుండి వేలకొలది యువకులు ముందు కురికినారు. వారి యుత్సాహము, వారి స్వాతంత్ర్యావేశము వర్ణనాతీతము. వారినందరిని వెంట నిడుకొని శత్రువుల నెదుర్కొనబయలుదేరిన దా యుపకరత్నము. ఆనాడా పర్ణకుటీరము త్యజించి బయలుదేరిన యోగీంద్రుడు అపర రుద్రునివలె దేశము నలువైపుల గుమ్మరుచు, మిలనీ నగర సమీప గ్రామములందు మహోపన్యాసములు గావించుచు, స్వదేశోద్ధరణకు ప్రజలకు మేలుకొలుప ప్రారంభించినాడు. ప్రజామండలిలో స్వాతంత్ర్య చైతన్యము కలిగినది. ప్రతివాని హృదయము దేశభక్తిపూరితమై పోయినది. ప్రజలు స్వాతంత్ర్యయుద్ధ సన్నాహనిమగ్నులై యున్నారు. భయంకర యుద్ధప్రారంభ సూచనలు ప్రజల ముఖకమలములయందు ప్రకులాడుచున్నవి. ఇంతలో విదేశ ప్రభుత్వము ఈ విషయమంతయు గని పట్టి క్రూరశాసనములు కుప్పతిప్పలుగ ప్రయోగించుట ప్రారంభించినది. "యోగిసుని పట్టుకొనుడు, యువకుని బంధించి జైలులో పార వేయుడు. మునీంద్రుని కాల్చిచంపుడు. అనురాజాజ్ఞ బయటబడ్డది. రాజభటులు క్రుద్ధులై ప్రతిగ్రామమును ముట్టడించుచు "యోగి ఎక్కడ? యోగిని యెచ్చట, యువకు డెక్కడ? అని ప్రజలను హింసించుచు వారి యిచ్చ వచ్చిన రీతిగా ప్రవర్తించుట ప్రారంభించినారు. ఈ యత్యాచారములు ప్రజలు సహించలేకపోయినారు. ఒక్కుమ్మడిగా ప్రజలు క్రుద్ధ సింహమూర్తులై మాతృదేశ స్వాతంత్ర్య యుద్ధమున బలియైపోవు

టకు బయటబడినారు. విప్లవాగ్ని రగుల్కొనినది. గుంపులు గుంపులుగా ఎవరికి దొరకిన యాయుధములువారు ధరించి, మిలన్ ముట్టడికుద్యుక్తులై యున్నంతలో యువక సైన్యము వచ్చి కలసినది. ఆ యువక వ్యక్తియే యీ సైన్యమున కంతటికి సర్వసేనాని యైనాడు. సైన్యమును నడుపుచు, వీరోచిత పూర్వగాథల జెప్పుచు వారిని వెన్నుజూపని వీరుల జేసినాడు. మిలన్ నగరము ప్రవేశించినారు. కోటముట్టడి ప్రారంభమైనది. ప్రభుత్వసైన్య మపారమైనప్పటికి యువకుడు నిరుత్సాహము జెందక తన కొద్ది సైన్యములోనే పోరాడుటకు ప్రారంభించినాడు. కొంచెము లనట గలిగినది. కాని దానిని లెక్కసేయక పోరాడుచునే యున్నాడు. ఇంతలో మునీంద్రు డసంఖ్యాకులైన సైనికులతో సింహనాదము జేయుచు వచ్చి శత్రుసైన్యమును ముట్టడించినాడు. విజయు డపారమైన స్త్రీపురుష యువక వృద్ధ సైన్యముతో మరియొక వైపునుండి ముట్టడించెను. భయంకర యుద్ధము ప్రారంభ మైనది. ఇరుతెగలనుండి యనేకమంది వీరసైనికులు స్వర్గమలంకరించిరి. ఏ వైపున జూచినను రుద్రమూర్తియనదగు యోగీంద్రుని సింహనాదములే. ఏ దిక్కున జూచినను అభినవ వీరాభిమన్యుడనదగు నానందకుమారుని యట్టహాసములే. ఏ తట్టు తిలకించినను నపరకాళికా మూర్తి యనదగు యోగిని వీరాలాపములె. యుద్ధరంగము శత్రువుల కనులకు మిరుమిట్లుగొల్పుచున్నది. మొదటినుండి విరామమనునది లేక పూర్తి శ్రమ జేయుటచేత నానందకుమారున కలసట గలిగినది. ఇది గమనించి శత్రుసైనికుడు అతనిని జంపుటకు ఖడ్గమెత్తినాడు. ఇంతలో యోగీంద్రుడది జూచి యువకుని చెంగట కొక్క యురుకురికినాడు. యువకుని మీద బడబోవు ఖడ్గము యోగీంద్రుని వక్షస్థలము మీద బడినది. ఆ దెబ్బ ఆయన రక్తనాళముల వరకు బోయినది. దానితో నా మహానుభావుడు భూమిపై కొరగినాడు. అది జూచి యువకుడు కన్నీటి బిందువులు కార్చినాడు. తన కర్తవ్యమును మరువక సైన్యమును పూర్తిగా హెచ్చరించినాడు. రెండవ వైపున యోగిని యగు విజయ శత్రు సైన్యమును నుసుమాడుచు వచ్చుచున్నది. ఎక్కడ శత్రువు లక్కడ పలాయనమగుటకు ప్రారంభించినారు. కంకాళ స్వరూపులైన విజయ సైనికులు వారిని వెంటాడుచు తరిమినారు. ప్రియమాతృదేశము స్వాతంత్ర్యము బొందినది. ఎర్రని జాతీయ

పతాకము కోటమీద ఎగురవేయబడినది. "జై స్వతంత్రమిలన్ కీ జై" అని జయనాదములు జేసినారు. కాని యా శుభసమయమున యువకుడు, యోగీంద్రుడు గానరాలేదు. పరుగు పరుగున రణభూమి నద్దకు జేరినారు. అచ్చట యోగీంద్రునిముందు కన్నీరు గార్చుచు కూర్చొనియున్న యువకుని జూచినది విజయ. 'హా నాథా! నాథా! మీరు ప్రాణదాన మొసంగిన మహానుభావుడెవరు? అని యా యువకుని కాళ్లు కన్నీటిజాలుతో కడిగినది. యువకుడు నిర్విణ్ణుడై, ప్రాణేశ్వరీ! బ్రతికితివా? నీకు ప్రాణదాన మొసంగిన పుణ్యమూర్తి యెవరు? దేశస్వాతంత్ర్యోద్ధరణ కొరకు యోగిని తిరుగుచున్నదని వింటిని గాని నీవనుకొనలేదు. నాకు ప్రాణభిక్ష బెట్టిన మహానుభావుడు—ఒకమారుగాదు; నా తుచ్ఛ ప్రాణములకొరకు తన యమూల్యమైన ప్రాణమును బలిగా నొసంగి రెండవమారును ప్రాణభిక్ష బెట్టిన మహామహుడు ఈ యోగీంద్రుడే! ఈ మహానుభావునకు నేనెంతో ఋణపడి యుంటిని.

నాథా! నాథా! ఆనాడు నాకు ప్రాణభిక్ష బెట్టిన మహానుభావుడు. యీ యోగీంద్రుడే యని యోగీంద్రుని పాదములకు నమస్కరించినది. మునీంద్రుడు కనులువిప్పి చూచినాడు. ప్రక్కన గూర్చొని యున్న ప్రియదంపతుల ముఖావలోకనము జేసినాడు. వారి కనులనుండి యశ్రు బిందువులు రాలుచున్నవి.

బిడ్డలారా? విచారింపకుడు మీవలన దేశమాత ధన్యయైనది, ఆనంద కుమార్! నీతండ్రి యాజ్ఞానుసారము దేశమును స్వతంత్రి పరచినావు. ధన్యుడనైతివోయి తండ్రీ!

యోగీంద్రా! పరమ పూజ్యులైన మీ ఋణము దీర్చుకొనలేను. ఆనాడు నన్నా యోగీంద్రుని వద్ద విడచిపోయిన నా తండ్రి యేమైనాడో తెలియదు. అని కన్నీటి చుక్కలు రాల్చును.

కుమారా!

దుఃఖింపకుము నేనే నీ తండ్రిని! చిన్నతనమునందే నిన్నా యోగీంద్రుని వద్ద విడిచి పోవుటచే నన్ను గుర్తించలేక పోతివి. నాయనా! నీయట్టి కుమారుని వలన విజయ వంటి కోడలి వలన నేను ధన్యుడనైనాను. దేశము

స్వతంత్రమగుట జూచినాను. స్వాతంత్ర్యవాయువులు పీల్చినాను. ఇక నేను బోవుచున్నానని యా యోగీంద్రుడు కనులుమూసి భౌతిక శరీరమును వదలి పెట్టినాడు. నాన్నా! నాన్నా, నీవేనా? యని తల మోదుకొనుచు తండ్రి కాళ్లమీద పడిపోయినా డాయువకుడు. మిలన్ దేశమున ఎఱ్ఱ జెండా మెగురుచున్నది. ప్రజాప్రభుత్వ మైనది. దేశము సుభిక్ష మైనది. భూమి సస్యశ్యామల మైనది. ప్రజలు సుఖవంతు లైనారు. విజయానంద కుమారు లా నాటి కుటీరమం దమందానంద మనుభవించు చున్నారు.

# జన్మభూమి

శ్రీ కన్నెగంటి ప్రభులింగాచార్యులు

శ్రీమదాంధ్ర క్షమా భామామణికి జగ
న్మాన్యమౌ గ్రైవేయనాయకంబు
కవి చక్రవర్తి పింగళి సూరనకు కాకు
నూ రప్ప కవికి జనుస్థలంబు
ప్రకృత విశ్వంభ రేంద్ర కిరీట మధ్య స్థి
త స్ఫుర ద్వజ్ర ప్రవాయకంబు
శిల్ప ప్రసిద్ధమై సిద్ధ నాగార్జునా
వాస మౌ గిరికి సింహాసనంబు

ఆజి రంగమునందు ముం దంజ వేసి
తనుమనః ప్రాణములు గూడ ధారవోసి
స్వర్గమందిన వీరుల స్థావరంబు
నవ్యగుణభూమి ! మా పలునాటిసీమ !

# ?

శ్రీ ఏటుకూరు వేంకట నరసయ్య

మును పా బ్రహ్మకుఁ గొమ్మలూడ్చిన మహాత్మున్ గాధిరాట్సూను సే
వన మయ్యె ఫలపుష్పతోయముల సంభావించి సర్వర్తుశో
భన లాభం బెసకొల్పుకొన్నది తపోభాగ్యంబు తాఁ బెంచి పి
ట్టనిచోటిం దొకఁడైన లేదు త దదృష్టం బేమనం జెల్లునో!

పలుమారల్ మహనీయుఁ డాతఁడు తపః ప్రభ్రష్టుఁడై మేనకా
జలజాక్షీమధురాధరోదిత సుధాస్వాద క్రియాలోలుఁడై
కులగోత్రమ్ములు దక్కి బ్రహ్మఋషినా ఘోరాటవీవాటిలో
నిలుగట్టిం దుద కంగలార్చిన సురజ్యేష్ఠుండు ప్రార్థింపఁగన్

ఆతని గోటి చెక్కడమునం దినవంశ విచిత్రవృత్తముల్
పూఁతలవిడ్జి రాలినవి పుణ్యధనుల్ మిథిలాధినాథు లీ
చేతికి నందవేసి రిఁకఁ జెప్పెడిదే మిరువిల్లు గాధిరా
ట్సూతికి రాచబాట; లోకఁపుం బ్రతిసృష్టికి నూఁఱువక్కనా!

వనవాసవ్రతదీక్ష గైకొని మనోవాంఛల్ విసర్జించి క
చ్చను బంధించిన మౌనిశేఖరుని సంసారంబు వేదాంత వా
సనతో, క్షాత్రముతో వెలుంగుట మహాశ్చర్యంబు కాదందుమా
తనవారల్ నిజకార్యఖడ్గ పరతంత్రస్వాంతు లెట్లయ్యెడున్?

ఏమని చెప్పికొందు మతిహీనుఁడు నిర్జరసార్వభౌముఁ డా
కాముకురాండ్రఁ దోలి మనకౌశికు నెన్ని విధాల నీడ్చెనో!
కాముఁ డెఱుంగు నాతనికె గా దటువంటి వసిష్ఠమౌని కీ
స్వామిని కామదేవుని వశంవదుఁ జేయక నిద్ర వట్టెనా!

అప్పటి రాక్షస ప్రళయ మార్గచరిత్రము రూపుమాపఁగా
నిప్పులు గ్రక్కుచున్న గమనించి మహామహుఁ డస్త్రవిద్యలో
నప్పుడు పట్టభద్రు లగునట్టి తెఱంగు సమీక్ష సేసి వా
రొప్పరికించినన్ నృపకులోచిత విద్యకు రెచ్చఁగొట్టెడిన్. [శృం-రా.]

# లోపలా—బయటా

శ్రీ చక్రపాణి

మన మనస్సును సాధారణంగా రెండు భాగాలుగా విభజింపవచ్చును. ఒకటి బయటా - రెండోది లోపలా. బయటకు కనబడే మనస్సు మర్యాదగానూ సంఘీభావంగాను (కలుపుగోలుతనం) నాగరికంగానూ ఉంటుంది. కాని లోపలిమనస్సు అన్నివేళల సంఘీభావం నాగరికం గా ఉండదు-దాని నడకా చింతనాపద్ధతి విచిత్రంగా ఉంటుంది. బయటి మనస్సు చేసే పనులు చూసి లోపలిమనస్సు ఒకప్పుడు నవ్వితే ఒకప్పుడు ఏడుస్తుంది-ఎప్పుడో కాని సమర్థించదు. వీటిపోట్లాట ప్రతినిత్యమూ ప్రతి క్షణమూ ఉండేదే.

రామకిశోర బాబు లోపలి మనస్సు చాలాకాలం నుంచి శవప్రాయంగా పడి ఉన్నది. అది బయటి మనస్సు అత్యాచారంవల్ల చివికిపోయింది. ఈయన వకీలు. హంతకుణ్ణి కాపాడటానికి తప్పుడుసాక్ష్యం సృష్టించడంలోనూ, జమీందారునకు సహాయం చేయటానికి బీదప్రజలను నాశనం చేయటంలోనూ, ఫోర్జరీ వీలునామాలు రాయించటంలోనూ, ఇంకా ఇలాంటి అన్ని పనులలోనూ ఈయన బయటి మనస్సు సహాయమే పొందుతుండేవాడు. లోపలి మనస్సు మొదట్లో ఈ పనులకు అడ్డుచెప్పి కొన్ని అనర్థాలు తెచ్చిపెట్టిందికూడా. కాని ఇప్పుడు ఏమీ జోక్యం చేసుకోటం లేదు.

ఆవాళ ఉదయం రామకిశోర బాబు బట్టతల చేత్తో నిమురుకుంటూ తోటలో పచారు చేస్తున్నాడు. ఒక విధవావిడ దావాలో కొన్నాళ్లనుంచి ఈయన మునిగి తేలుతున్నాడు. ఇవ్వాళ ఆ కేసువిచారణ - అందుచేత కొంచెం వ్యాకులంగా ఉన్నాడు — పరధ్యానంగా ఉన్నాడని వేరే చెప్పట మెందుకు?

ఇలాంటి సమయంలో మధ్యకారు పెద్దమనిషి ఒకాయన వచ్చి నమస్కరించి ఒక వ్యవహారంలో సలహాతీసుకోటానికి వచ్చానని చెప్పాడు. రామకిశోరబాబు ఆ వచ్చిన పెద్దమనిషిని ఎరగడు. అందుకనే సంస్సంకోచంగా "ఎలా విషయమైతే నేను ఫీజు తీసుకొంటానని తమకు తెలుసునా!" అన్నాడు

'చిత్తం ఎంత చెల్లించుకోవల్సి ఉంటుంది?'

'ముప్ఫయి రూపాయలు'

'సరే అలాగే తీసుకోండి'

ఇద్దరూ ఆఫీసుగదిలోకి పోయి కూర్చున్నారు.

'మా బంధువుకు ఒక్కడే కొడుకు. వాడికి వివాహమై పదిసంవత్సరా లైంది. ఇంతవరకు సంతానం లేదు. ముందు కలుగుతుందన్న నమ్మకం కూడా తక్కువ.' అన్నాడు పెద్దమనిషి.

'డాక్టరుకు చూపించారా?'

'ఆ—సంతానం కలగటం అసంభవమని వారి అభిప్రాయం.'

'కుర్రవాడు మంచి ఆరోగ్యవంతుడేనా?'

'ఆ—వాడి కేజబ్బూ లేదు.'

'అయితే, ఏవిషయమై కావాలి నా సలహా?' అని రామకిశోరబాబు పొడుంకాయలో నుంచి ఒక చిటికె నస్యం తీశాడు.

'ఇలా సంతానం లేకుండా వంశం నశించిపోయేటట్టయితే వాళ్ళఆస్తి ఎవ రికి చెందుతుంది?'

చిటికెడుపొడుమూ రెండుముక్కుల్లోకి పీల్చి 'కుర్రవాడుగనక ఆరోగ్య వంతుడైతే అతను హాయిగా పెళ్ళిచేసుకోవచ్చు. హిందూలాప్రకారం ఏ అడ్డూ ఉండదు.' అన్నాడు రామకిశోరబాబు.

'లేనిమాట నిజమే! చట్టం అడ్డులేకపోయినా మనం అన్నిపనులూ అన్న ప్పుడల్లా చేయగలమా?'

రామకిశోరబాబు నవ్వి— 'సెంటిమెంట్ ప్రకారం నడిస్తే ప్రపంచంలో పనులు జరుగుతాయటండీ! ఇలాంటి పాడు సెంటిమెంట్స్‌తోనే మనంముని గిపోతున్నాము!' అన్నాడు

తర్వాత రామకిశోరబాబు సెంటిమెంటు ప్రకారం నడిస్తే ఎన్ని నష్టా లుంటాయో చిన్నఉపన్యాసంలో చెప్పారు. బయటిమనస్సు వారికి ఉదా హరణ వగైరాలు సంపాదించిపెట్టింది. లోపలిమనస్సు కిక్కురుమనకుండా ఊరుకున్నది.

'ఒకవేళ అతను కుర్రవాడికి పెళ్లి చేయదనుకోండి. అప్పుడు ఆ ఆస్తి ఎవరికి పోతుంది?' అన్నాడు ఆగంతుకుడు.

చట్టప్రకారం వారసు లెవరో రామకిశోర బాబు గడగడ చెప్పివేశాడు. తర్వాత తన సొంత అభిప్రాయం కూడా చెప్పకుండా వదలలేదు.

'కుర్రవాడికి మళ్ళీ పెళ్ళి చేసెయ్యండి. గొడ్రాలుతో ఎవరు సుఖపడతారు? పిల్లా జెల్లా లేకపోతే సంసారం శ్మశానంలాగా ఉంటుంది! చూడండి, నాకు ఉచితమని తోచింది మీకు చెప్పాను. మీ సెంటిమెంట్‌కు గనక కష్టంవేస్తే నన్ను క్షమించండి!'

'ఎబ్బే, కష్ట మేమీ లేదండి! తమరు నిష్కాపట్యమనిషనీ, క్లయింట్ల హితైషులనీ తెలిసే తమదగ్గరికి వచ్చాను.

ఫీ ఇచ్చి పెద్దమనిషి వెళ్ళిపోయాడు.

* * * *

నాలుగైదు రోజులు గడిచినాక ఒకనాటిమధ్యాహ్నం గుర్రపుబండి ఒకటి రామకిశోర బాబు వాకిట్లో నిలబడింది. బండిలోనుంచి ఒకయువతి దిగి ఇంట్లోకి వెళ్ళింది.

రామకిశోర బాబు భార్యా పోయింది. ఇంట్లో ఆడవాళ్ళు లేరు. వంటవాడూ, నౌకర్లూ,మధ్యాహ్నం కాబట్టి పెద్దనౌకర్లెవరూ ఇంట్లో లేరు. కుర్రవాడొకడు ఇల్లు కనిపెట్టుకుని ఉన్నాడు. వాడే బండిలోనుంచి పరుపూ, ట్రంకూ దించి ఇంట్లోకి తెచ్చాడు. ట్రంకుమీద పేరు రాసి ఉన్నది. 'సరోజినీదేవి' అని.

ఆచరణనుబట్టి చూస్తే కుర్రవాడు సరోజినీదేవిని ఎరిగినట్టుగా కనబడలేదు. పైగా ఆమె ఆచరణ కుర్రవాణ్ణి మరింత ఆశ్చర్యాన్వితుణ్ణి చేసింది.

'సరోజినీదేవి నట్టింట ట్రంకుపెట్టె వగైరాలు పెట్టించి బాబుగారెక్కడ?' అని కుర్రవాణ్ణి అడిగింది.

'కోర్టుకు వెళ్ళారు.'

'ఎప్పుడొస్తారు?'

'తెలియదు నాకు.'

సరోజినీదేవి ట్రంకుమీద కూర్చున్నది—మూర్తీభవించిన విషాదంలాగా.

* * * *

రామకిశోర బాబు కోర్టునుంచి వచ్చి విస్తుపోయాడు.

"ఇదేమిటి, సరూ! కబురుచేయకుండా హఠాత్తుగా వచ్చావేం?"

"ఇక వాళ్ల ఇంట్లో ఉండడం నాకిష్టం లేదు!"

"ఎందుకని; అసలు సంగతేమిటి?"—కుమార్తె ప్రవర్తన తండ్రికి మరీ ఆశ్చర్యం కలగజేసింది.— "నాకిష్టం లేదంటే—?"

"వాళ్లు అబ్బాయికి మారుపెళ్లి చేస్తున్నారు! నువ్వుకూడా చేయమన్నావటగా?"

"నేను చేయమన్నానా! అంటే—?"

"వాళ్లు నువ్వు ఎరగని మనిషిని ఒకతన్ని పంపి నీ అభిప్రాయం తెలుసుకున్నారట! కుర్రవాడికి మళ్లీ పెళ్లిచేయటమే మంచిదని నువ్వు—"

నేపథ్యంలో ఉంటున్న రామకిశోర బాబు లోపలిమనస్సు బయటిమనస్సు గొంతు పట్టుకున్నది. రామకిశోర బాబు అసహాయుడై తన ఏకైకపుత్రిక ముఖంవంక దీనంగా చూస్తూ ఉండిపోయాడు.

"నిజంగా నువ్వు చెప్పావా నాన్నా?" అన్నది మళ్లీ సరోజిని.

వనఫూల్ రచనకు.

# ఈ రంగ డెవ్వరు?

శ్రీ గుంటుపల్లి సీతారామయ్య

రంగ రంగంటావు!
సాష్టాంగ పడతావు!
కావేటిరంగ మము
కావు కావంటావు!
ఈ రంగ డెవ్వరో
ఊహింప గలవా?
కావేటి తీరాన
శ్రీరంగ క్షేత్రాన
యాత్ర జేసే ప్రజల
నానంద వీచికల
నోలలాడించేటి
శ్రీరంగ నాథుడా?
విపులాట్టహాసాన
విపరీత భోగాన
సకల సౌఖ్యాలలో
సంతతారాధనల
తులదూగు చుండేటి
శృంగార రంగడా?
చంద్రభాగా సము
త్తుంగ భంగములతో
పొంగారు భక్తితో
డెందాన నానంద
మందుచుండెడు భక్త
బృందముల బ్రోచు శ్రీ
పండరీ రంగడా?

చంద్రభాగానదీస్వచ్ఛతోయమునందు
మంత్రపూతస్నాన
మహిమతో వెలుగొంది
సంకీర్తనలుచేయు
సాధుపుంగవుల హృ
ద్రంగముల వెలుగొందు
సదయాంతరంగుడా?
కాదు కా దీతడు
కష్టజీవుల బ్రోవ
నిత్యయత్నము జేసి
నిలువునా కష్టించి
పేరుగన్నట్టి యా
ప్రఖ్యాతపురుషుండు!
కడుపుమంటలతోడ
కండ్ల ప్రాణముతోడ
పలుపాట్లు పడుచున్న
పామరుల బ్రోవంగ
కంకణముగట్టిన
కర్మవీరుండితడు!
అసమాన వాగ్ధాటి
పసమీరు నాప్రజ్ఞ
ఉద్భ్రాత లూపించు
ఉద్వేగ మెక్కించు
సాహసినిగావించు
శక్తిమంతుండితడు!

## శ్రీ నిరంజన విజయము

కర్త : శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు గారు కోపల్లె, తెనాలి.

శ్రీనిరంజనశాస్త్రిగారిజీవితచరిత్రము. శ్రీ శాస్త్రిగారి పాండిత్యము సర్వతోముఖము. ఇట్టివారు దేశములో పుట్టుట అరుదు. శ్రీ శాస్త్రిగారు కమ్మరప్రవృత్తియే జీవికగా గల విశ్వబ్రాహ్మణ కుటుంబమందు జన్మించియు సంప్రదాయాగతమగు వృత్తివిద్యను విడనాడకే వేదవేదాంత తర్క న్యాయ మీమాంసాది శాస్త్రములలో చక్కని ప్రవేశము సంపాదింపగల్గిరి. "ఛాందసాః శ్లోకశత్రవః" అను పురాతనోక్తిని సహజసుందరమగు తమ కవితా కళావిన్యాసము ద్వారా అన్యథాకరించిరి, అంటేనే, శ్రీశాస్త్రిగారిఉపజ్ఞావిద్వత్తుల దివ్యతేజము మిన్నందిన దన్నమాట. అట్టివీరి శాస్త్రవిద్యాకళాసంపద పురా మహాకవుల బుద్ధిమత్తకు ప్రత్యక్షసాక్ష్యము.

శాస్త్రిగారు తమకు గల పాండితీమహిమకు మురిసికొని ఇంట గూర్చుని ఆనందించు వ్యక్తిమాత్రుడు కాడు. బాల్యమాది కర్మవీరుడు. ఆంధ్ర, తమిళ, కర్నాట, మహారాష్ట్రాది దేశము లరిగి అందందు జరుగు విద్వద్గోష్ఠి ప్రకరణములకు జీవముపోసి ఆ యా పరిషత్తులను ప్రజాహితైక సంస్థలనుగా మార్పించెను. సనాతనమును సంప్రదాయాగతమును అగు శిల్ప కలావైదుష్యమెడలి దిక్కులుచూచుచున్న ఆత్మీయ విశ్వబ్రాహ్మణ సంఘము నుద్ధరింప "ప్రబోధిని"అను ఒకపత్రిక నెలకొల్పి తద్ద్వారా సంఘశ్రేయోన్నతికి అఖండమగు సేవచేసిరి. "హింసలేనిది యజ్ఞమే"కా దను మూఢవిశ్వాసమును మొకటివేళ్ళతోగూడ నున్మూలించి అనేక ప్రదేశములందు "అహింసాయజ్ఞములు" అనిదంపూర్వమగు మహామార్గమున తామె నిర్వహింపజేసిన ప్రజ్ఞాశాలి యజన యాజనకర్మ సిద్ధాంతములన్నింటను నిష్ణాతుడు. పూర్వోక్తగుణముల నున్నతులైన వారు మధురకవితావిన్యాసము చూపగలుగుట ఏ కాలమందును ఏ దేశములోను గూడ చాల గగనమగుట వాస్తవము; కాని నిరంజనశాస్త్రిగారు సంపూర్ణముగ జయమందిరి. శాస్త్రిగారి కవితాకళాభంగిమ రసజ్ఞాంధ్రుల చిత్తము నాచికొనజాలునంత మధురమధుర మగు ఫణితితో ద్రాక్షాపాకమున చవులూరించుచున్నది. ఇంత శాస్త్ర పాండితి, ఇంతకవితానిష, ఇంత కర్మశూరత్వము ఎక్కడనోగాని చూడలేము. ఇట్టి వీరి పవిత్ర జీవిత చిత్రణమునకు శ్రీ రాఘవాచార్యులుగారి రచనా విన్యాసము ఎంతేని తగియున్నది. రచనలో బిగువున్నది. మధురభావ భరితమై ఉదాత్తమగు శైలితో బింకముగ నడచినది. కవులు, విద్వాంసులు పఠించ దగిన గ్రంథము.

## అసంపూర్ణరామాయణం

కర్త : మల్లాది అవధాని

ఆంధ్రాస్పిరిట్; నాట్యభారతి, విజయనగరం.

అవధానిగారు ఆంధ్రలోకానికి చిరపరిచితులు. కథలకు నాటికలకు ఉబలాటపడే తెలుగు పాఠకులు వీరి రచనలకోసంఎదురుచూస్తూ ఉంటారు. ప్రస్తుతం ఇవి రెండూ వ్యంగ్య

నాటికలు. అసంపూర్ణ రామాయణం నాట్యరంగస్థలాన్ని, నటకుల్నీ, నాటకాల్నీ, విమర్శించి ప్రేక్షకులను ప్రబోధించడానికి ప్రాకామంటున్నారు కర్తలు. ఆ విషయంలో కృతార్థులైనా ధోరణి అతివేగం అయిపోయింది నవ్వైతే బాగా వస్తుందికాని అతి అసహ్యమనిపిస్తుంది. ఆంధ్రాస్పిరిట్‌లో తోకచుక్కలాంటి కథకుల్నీ, ప్రేమవిరహ కవులనూ, విమర్శకులనూ విమర్శించారట. కాని వ్యక్తి దూషణ వ్యక్తమవుతుంది. ఇదికూడా మంచిదికాదు. ఏదెట్లా ఉన్నా ఉబుసుపోని వారికి ఉన్నత సాహిత్యం;—అథవా సాహిత్యమంటేనే రుచించని వ్యక్తులకూ ఈ పుస్తకం పొద్దుపుచ్చుతుంది. వెల నాలుగణాలు

రామం

# కరుణకుమార కథలు

ఈ కథా సంపుటి కరుణకుమార విరచితము, ఇందులో ఆరు కథలున్నవి. ప్రతి కథలోను ఒక విశిష్టత ఉన్నది. కథాసాహిత్య మంటే నోరూరుచున్న ఈ రోజులలో ఇటువంటి ఉత్తమ కథాసంపుటి వెలువరించిన గ్రంథకర్తను మనము అన్నివిధాల అభినందించవలెను.

ఈ కథానికలందరి పాత్రలు దరిద్రులు, గ్రామ్యులనగు సామాన్య జనులు ఇట్టి వీరి నిత్య వ్యవహారములు, సాంఘికవ్యవస్థలు సాకుగా తీసికొని ఉబుసుపోకకే గాక జీవితాదర్శ ముగా ఉండునట్లుకూడ గ్రంథకర్త వెలార్చినాడు. దుక్కిటెద్దు, మారని రూపాయి ఇత్యాదులుకూడ కథావస్తువుగా తీసికొని మధుర భంగిమతో కథ రక్తి కట్టించగల యోగ్యత గ్రంథకర్తకు కలదు. అందువల్లనే కథావస్తు వేదైనను కథకుడు ప్రతిభాశాలిగా ఉండవలెనని రసజ్ఞు లందురు. అట్టిదే ఈ కథాసంపుటిలో మనకు కనిపించును.

ఈ కథా సంపుటిలోనిభాష వ్యావహారికము. ఎగుడు దిగుడులేని శైలీవిన్యాసము చక్కగా కుదిరినది. కథాకల్పనకు రచనా ధోరణి మెరుగు పెట్టుటవల్లనే ఈకథలు చివరకు చదువుదాక వదిలిపెట్ట బుద్ధి పుట్టదు ముందేమి జరుగునో అన్న రహతహ అంత్యము దాక పాఠకుని విడువదు. గుంటూరు మండలము వారి తెలుగే ఆంధ్రవాఙ్మయనిర్మితికి ఆదర్శ మని పూర్వాంధ్రగ్రంథాలు వేనోళ్ల చాటుచున్నవి. వ్యావహారికాంధ్రమునకు గూడ నదే శరణ్యమనుట దాపాటమగు సత్యము. గుంటూరు మండలమునకు పొలిమేర మండలమగు నెల్లూరి మండలములోని సామెతలు వగైరాలు యథాతథముగా ఉపయోగించుకొనుట వల్ల వీరి భాషాశైలికి కొంత ఎక్కువ చైతన్యము, అందము కలిగిన దనవచ్చు. గ్రాంథికాంధ్రమున కెట్లో, వ్యావహారికాంధ్రమునకు గూడ నట్లే ముందుముందు గుంటూరు మాండలికభాషయే ఆదర్శముగా ఉండగలదని మా విశ్వాసము.

"హాస్యమున నున్న సారమ్ము అందఱెఱుగుదురు"అన్నారుగనుకను, ఈ సంపుటిలో మధ్య మధ్య హాస్యరసము చిప్పిలు చుండును గనుకను ఆబాలవృద్ధముగూడ ఈ సంపుటి కొని చదివి ఆనందించవలెనని మా మనవి 201 పేజీలు - దళసరి గ్లేజుకాగితాలు - క్రౌన్ ఆక్టేవో సైజున రమణీయముగ ముద్రింపబడినది. వెల రు 0—1—0 మాత్రమే. దొరకుచోటు:-ఆధునిక వాఙ్మయకుటీరం, నెంబరు స్పర్టాంకు 2 వవీధి ఎగ్మూరు, మద్రాస్.

సత్యం

# మహారాజపోషకులు

శ్రీశ్రీ మంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్ జమీందారుగారు, చల్లపల్లి.
,, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు, కారంచేడు.
,, నూతక్కి రామశేషయ్యగారు, అసిస్టెంటు దివాన్, జయపూర్ ఎస్టేటు, రాయగఢ్.
,, తలశిల హనుమయ్య చౌదరిగారు, నాగాయలంక (కృష్ణాజిల్లా)
,, చదలవాడ కుటుంబరావుగారు, కంట్రాక్టరు, పెదపూడి, తెనాలి
,, కోడూరి సత్యనారాయణగారు, కంట్రాక్టరు, కంకిపాడు, బెజవాడ.

# రాజపోషకులు

శ్రీ భూపతిరాజు సుబ్బరాజుగారు, పేంద్ర. పశ్చిమ గోదావరి

# పోషకులు

శ్రీ వాసిరెడ్డి వీరవరప్రసాద్‌గారు, వీరులపాడు, కృష్ణా.
,, పాములపాటి బుచ్చినాయుడుగారు, నిడుబ్రోలు, తెనాలి.
,, చల్లా కాశింరెడ్డిగారు, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, కొత్తరెడ్డిపాలెం, తెనాలి.
,, వంకమామిడి కామేశ్వరరావుగారు, తెనాలి.
,, వాసిరెడ్డి మహదేవయ్యగారు, చేబ్రోలు.
,, పత్రి శ్రీనివాసరావుగారు, ఘూస్వాముల, గుంటూరు.
,, గాదె వీరారెడ్డిగారు, కొత్తరెడ్డిపాలెం, తెనాలి.
,, వెలువోలు సీతారామయ్యగారు, గుంటూరుజిల్లా కా. సం. కార్యదర్శి, అమృతలూరు.
,, ఆలపర్తి వేంకటరత్నం చౌదరిగారు, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, యడ్లపల్లి.
,, ఎలపర్తి శ్రీరాములు చౌదరిగారు, ఎలవర్రు.
,, పరుచూరు చినబసవయ్యగారు, మ్యునిసిపల్ కౌన్సిలరు, తెనాలి.
,, చావ చిట్టెయ్య చౌదరిగారు, చావవారిపాలెం, తెనాలి.
,, కొల్లి వెంకట కృష్ణయ్య చౌదరిగారు, నరసన్నపాలెము, కృష్ణా.
,, చావరాల కృష్ణబ్రహ్మంగారు, గుంటూరు.
,, పడాల కోటయ్యనాయుడుగారు, బి. ఏ., బి. యల్., గుంటూరు.

సారథివారి:

# రైతు బిడ్డ

27—8—39 తెలుగుదేశ మంతటా ఒకేసారి విడుదల

రైతుల నిత్యజీవితమును కండ్లార చూచి

ఆనందించుటకు ఇదే తరుణము.



[illegible]

★ —4—0

★ [illegible]

★ సూర్యకుమారి

★ రాఘవయ్య చౌదరి

★ సుందరమ్మ

★ సూరిబాబు

★ పద్మలక్ష్మి

★ నగరాజారావు

వగైరా.

కాసా రాజరత్నం

డైరెక్టరు: గూడవల్లి రామబ్రహ్మం

మ్యూజిక్: భీమవరపు నరసింహారావు

---

సారథివారి మూడో చిత్రం

## 'దేశబంధు'

విద్యావంతులగు నటీనటులు కావలెను

